# సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశం గురించి సమాచార ప్రకటన

మాస్కో, 4–7–57 (టాస్)—సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ యొక్క ఒక ప్లీనరీ సమావేశం యీ సంవత్సరం జూన్ 22 నుండి 29 వరకు జరిగింది.

ఈ ప్లీనరీ సమావేశం జి. ఎమ్. మాలెంకోవ్, ఎల్. ఎమ్. కగనోవిచ్, వి. ఎమ్. మోలటోవ్‌ల పార్టీ వ్యతిరేక జట్టు సమస్యను గురించి చర్చించింది.

ప్లీనరీ సమావేశం నేడు ప్రకటింపబడుతున్న ఒక ఉచితమైన తీర్మానాన్ని ఆమోదించింది.

ప్లీనరీ సమావేశము కామ్రేడ్‌లు మాలెంకోవ్, కగనోవిచ్, మోలటోవ్‌లను కేంద్రకమిటీ అధ్యక్షవర్గం సభ్యత్వంనుండీ, సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీనుండీ తప్పించింది; కామ్రేడ్ షెపిలోవ్‌ను సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి పదవినుండి తొలగించి, ఆయనను కేంద్రకమిటీ అధ్యక్షవర్గ ప్రత్యామ్నాయ సభ్యత్వంనుండీ, కేంద్రకమిటీ సభ్యత్వం నుండి తప్పించింది.

ప్లీనరీ సమావేశం ఈ దిగువ నుదహరించిన సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ అధ్యక్షవర్గాన్ని యెన్నుకున్నది.

అధ్యక్షవర్గం సభ్యులు: కామ్రేడ్‌లు ఎ. బి. అరిస్తోవ్, ఎన్. ఐ. బేల్యాయేవ్, ఎల్. ఐ. బ్రెజ్‌నేవ్, ఎన్. ఎ. బుల్గానిన్, కె. ఇ. వొరొషిలోవ్, జి. కె. ఝుకోవ్, ఎన్. జి. ఇగ్నతోవ్, ఎ. ఐ. కిరిచెంకో, ఎఫ్. అర్. కొజ్లోవ్, ఒ. వి. కూసినిన్, ఎ. ఐ. మికోయాన్, ఎమ్. ఎ. సస్లోవ్, ఇ. ఎ. ఫుర్త్సెవా, ఎన్. ఎస్. కృష్చేవ్, ఎన్. ఎమ్. ష్వేర్నిక్.

అధ్యక్షవర్గం ప్రత్యామ్నాయ సభ్యులు: కామ్రేడ్‌లు ఎన్. ఎ. ముఖిత్‌దినోవ్, పి. ఎన్. పోస్పెలోవ్, డి. ఎస్. కొరోత్‌చెంకో, యై. ఇ. కాల్న్‌బెర్జిన్, ఎ. పి. కిరిలెంకో, ఎ. ఎన్. కొసిగిన్, కె. టి. మజురోవ్, వి. పి. మజ్వనద్, ఎం. జి. పెరువ్కిన్.

ప్లీనరీ సమావేశం కామ్రేడ్ ఒ. వి. కూసినిన్‌ను సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ కార్యదర్శిగా ఎన్నుకొని సెక్రటేరియట్‌ను భర్తీచేసింది.

(టాస్)

# జి. ఎమ్. మాలెంకోవ్, ఎల్. ఎమ్. కగనోవిచ్, వి. ఎమ్. మోలటోవ్‌ల పార్టీ వ్యతిరేక బృందాన్ని గురించి సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశం తీర్మానం

మాస్కో, 4–7–57, (టాస్):—1957 జూన్ 22 నుండి 29 వరకు జరిగిన సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశం, సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ అధ్యక్షవర్గంలో యేర్పడిన మాలెంకోవ్, కగనోవిచ్, మోలటోవ్‌ల పార్టీ వ్యతిరేక జట్టు సమస్యను పరిశీలించింది.

కేంద్రకమిటీచే నడుపబడుతూ, మొత్తంగా ప్రజలచే బలపర్చబడుతూ పార్టీ, జాతీయ ఆర్థిక విధానాన్ని మరింతగా వృద్ధిచేసి, సోవియట్ ప్రజల జీవన ప్రమాణాన్ని క్రమంగా పెంపొందించడానికీ, పార్టీ జీవితంలో లెనినిస్టు ప్రమాణాలను తిరిగి స్థాపించడానికీ, విప్లవాత్మక న్యాయచట్ట అతిక్రమణలను అంతమొందించడానికీ, పార్టీకి, ప్రజలకు మధ్యగల సంబంధాలను విస్తృతం చేయడానికీ, సోవియట్ సోషలిస్టు ప్రజాస్వామ్యాన్ని పెంపొందించడానికీ, సోవియట్ దేశ వివిధ ప్రజల మధ్య మైత్రిని పటిష్ఠంచేయడానికీ, జాతీయ విధానంలోను, విదేశాంగ విధానరంగంలోను సరియైన విధానాన్ని అనుసరించడానికీ, సుస్థిర శాంతిని చేకూర్చేందుకు అంతర్జాతీయ ఉద్రిక్తతను సడలింపజేయడానికీ ఉద్దేశింపబడిన 20వ మహాసభ చరిత్రాత్మక నిర్ణయాలను అమలు జరపడానికి బ్రహ్మాండమైన కృషి సల్పుతున్న సమయంలో, సోవియట్ పౌరుల్లో ప్రతి ఒక్కరికి సువ్య

క్తమైన, ముఖ్యమగు అభివృద్ధి అన్ని రంగాలలోను జరిగిన సమయంలో మాలెంకోవ్, కగనోవిచ్, మోలటోవ్‌ల పార్టీ వ్యతిరేక జట్టు పార్టీ విధానానికి వ్యతిరేకంగా నిలచింది.

పార్టీయొక్క రాజకీయ విధానాన్ని మార్చేందుకు ప్రయత్నిస్తూ, ఈ జట్టు సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశంచేత యెన్నుకొనబడిన పార్టీ ప్రధాన సంఘాల కూడికను మార్చే ప్రయత్నంలో పార్టీ వ్యతిరేక, పాక్షిక పద్ధతులను ఉపయోగించింది.

ఇది కాకతాళీయంగా జరిగిపోయిన సంఘటన కాదు.

వ్యక్తి ఆరాధనవల్ల ఉద్భవించిన పొరపాట్లను, లోపాలను సరిదిద్దుకోడానికి, అంతర్జాతీయ రంగంలోను, దేశంలోను మార్క్సిజం-లెనినిజం యొక్క రివిజనిస్టులకు వ్యతిరేకంగా విజయవంతమైన పోరాటాన్ని కొనసాగించడానికీ పార్టీ స్థిరమైన మార్గాన్ని అనుసరిస్తున్న గత మూడు, లేదా నాలుగు సంవత్సరాలలో, గతంలో చేయబడిన లెనినిస్టు జాతీయ విధానంయొక్క వక్రీకరణలను సరిదిద్దుకొనుటలో పార్టీ హర్షింపదగిన పనిని చేసిన యీ కాలంలో, ఇప్పుడు బాగా బహిరంగపర్చబడిన పార్టీ వ్యతిరేక జట్టు సభ్యులు, సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ 20వ మహాసభ ఆమోదించిన మార్గాన్ని ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ యెల్లప్పుడూ వ్యతిరేకిస్తూ వచ్చారు. ఈ జట్టు, విభిన్న సాంఘిక వ్యవస్థలు గల దేశాల మధ్య శాంతియుత సహజీవనం ఉండాలి, అంతర్జాతీయ ఉద్రిక్తత సడలింపజేయబడి, సోవియట్ దేశానికీ, ప్రపంచంలోని ఇతర ప్రజలకు మధ్య స్నేహ సంబంధాలు స్థాపింపబడాలి అన్న లెనినిస్టు విధానాన్ని ఆచరణలో వ్యతిరేకించడానికి ప్రయత్నించింది.

ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధి రంగంలోను, శాసన విషయిక రంగంలోను యూనియన్ రిపబ్లిక్‌ల అధికారాలను విస్తృతం చేయడానికీ, ఈ కార్యాలను నెరవేర్చేందుకు స్థానిక సోవియట్ల పాత్రను అధికం చేయడానికీ వీరు వ్యతిరేకులు. ఆ విధముగా పార్టీ వ్యతిరేకజట్టు, జాతీయ రిపబ్లిక్‌లలో మరింత వేగమైన ఆర్థిక సాంస్కృతికాభివృద్ధి కొరకు పార్టీ తీసుకొన్న స్థిరమైన మార్గాన్ని, మన దేశంయొక్క అందరు ప్రజల మధ్య మరింత అధికమైన లెనినిస్టు మైత్రిని చేకూరే మార్గాన్ని ప్రతిఘటిస్తూ వచ్చింది. దురధికారవర్గాన్ని నిరోధించడానికీ, అమితంగా పెరిగిపోయిన ప్రభుత్వ యంత్రాంగాన్ని తగ్గించడానికీ ఉద్దేశించి పార్టీ తీసుకొంటున్న చర్యలను అర్థం చేసుకొనడానికి బదులు పార్టీ వ్యతిరేక జట్టు వాటిని వ్యతిరేకిస్తూ వచ్చింది. ఇవన్నీగాక, ఈ జట్టు, పార్టీ అమలు జరుపుతున్న కేంద్రీకృత ప్రజాస్వామ్యపు లెనినిస్టు సూత్రాలను వ్యతిరేకించింది.

ఈ జట్టు, మొత్తం పార్టీ, ప్రజలు ఆమోదించినట్టి, పారిశ్రామిక నిర్వహణను పునర్నిర్మించి, ఆర్థిక ప్రాంతాలలో ఆర్థిక సంఘాలను యేర్పాటు చేయడంలాంటి అత్యంత ప్రధానమైన చర్యను యెప్పుడూ వ్యతిరేకిస్తూ వచ్చింది, వమ్ము గావించడానికి ప్రయత్నించింది. సోషలిస్టు పరిశ్రమల యొక్క అభివృద్ధి బ్రహ్మాండమైన స్థాయిని చేరుకొని, అత్యంత వేగముతో కొనసాగుతున్న ప్రస్తుతదశలో, భారీపరిశ్రమల అభివృద్ధి ప్రథమ స్థానాన్ని ఆక్రమిస్తున్నప్పుడు, ఇప్పటికంటె అధిక లాభాలను చేకూర్చి, సోవియట్ పరిశ్రమల్లో ఇంకా శక్తివంతమైన పెరుగుదలకు గ్యారంటీ యివ్వగల నూతనము, ఉత్తమము అయిన పారిశ్రామిక నిర్వహణ రూపాలను కనుగొనడం తప్పనిసరి అవుతుందన్న విషయాన్ని అర్థం చేసుకోడానికి నిరాకరిస్తున్నారు. పై విషయాలు దేశమంతటా చర్చింపబడి ఆమోదింపబడినమీదట, సోవియట్ దేశ సుప్రీం సోవియట్ సమావేశంలో శాసనంగా చేయబడిన తర్వాతగూడా పారిశ్రామిక నిర్వహణ పునర్నిర్మాణానికి వ్యతిరేకంగా పోరాటాన్ని కొనసాగించేవరకు వెళ్ళిందీ జట్టు.

వ్యవసాయ సమస్యల విషయంలో ఈ జట్టు సభ్యులు అత్యవసరమైన నూతన అవసరాలను అర్థం చేసుకొనలేక పోయారు. వ్యవసాయిక ఉత్పత్తుల మొత్తాన్ని అధికం చేయడానికి సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతులకు ఉత్సాహాన్ని కల్పించేందుకు వస్తు విషయికమైన లాభాలు అధికమయ్యేట్టు చేయవలసిన ఆవశ్యకతను వారు గుర్తించలేరు. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో ప్లానింగ్ చేసే పాత దురధికార పద్ధతిని రద్దుపర్చి, సమిష్టి వ్యవసాయక్షేత్రాలు తమ ఆర్థిక విధానాన్ని నడుపుకోడానికి ప్రోత్సాహాన్ని కల్పించే క్రొత్త ప్లానింగ్ పద్ధతిని, అప్పుడే కచ్చితమైన ఫలితాలనిచ్చిన పద్ధతిని, ప్రవేశపెట్టడాన్ని వారు అధిక్షేపించారు. సమిష్టి వ్యవసాయరైతులు తమ వ్యక్తిగతమైన భూముల్లో పండించే పంటను ప్రభుత్వానికి తప్పనిసరిగా అందజేసే పద్ధతి ఈ సంవత్సరాంతంలో రద్దుచేయబడగల ప్రత్యక్ష అవకాశాన్ని గ్రహించలేనంతగా వాస్తవ విషయాలకు దూరమయ్యారు వారు. సోవియట్ దేశంలోని లక్షలాది శ్రమిక ప్రజలకు అత్యంత ప్రాముఖ్యతను కలిగివున్న ఈచర్య అమలు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోని సాంఘికాధిపత్యంగల పశు ప్రజననంలో అధికమైన అభివృద్ధి కలగడం మూలాన, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు బాగా అభివృద్ధిపొందడం మూలాన సాధ్యమయింది. ఈ అత్యవసరమైన విషయాన్ని బలపర్చడానికి బదులు పార్టీ వ్యతిరేక జట్టు సభ్యులు దానిని వ్యతిరేకించారు.

పాలు, వెన్న, మాంసం తలొక్కింటి ఉత్పత్తి మొత్తం విషయంలో రాబోయే కొద్ది సంవత్సరాలలో అమెరికాను అధిగమించాలని పార్టీచేసిన విజ్ఞప్తికి—సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు, మండలాలు, రిపబ్లిక్‌లు దీనిని ఉత్సాహంతో బలపర్చాయి—వీరు వ్యతిరేకంగా పూర్తిగా అకారణమైన పోరాటాన్ని కొనసాగిస్తూ వచ్చారు. ఈ విధంగా పార్టీ వ్యతిరేకజట్టు, ప్రజలలోని విస్తృతవర్గాల అత్యవసర, అత్యంత ప్రధాన ప్రయోజనాల విషయంలో అహంకారపూరిత వైఖరిని, సోషలిస్టు ఆర్థిక విధానం యొక్క బ్రహ్మాండమైన శక్తిలో, పాలు, మాంసం ఉత్పత్తి అత్యంత వేగంగా వృద్ధి చేయడానికి గ్రామీణ ప్రాంతాలలో నడుస్తున్న ఉద్యమంలో అవిశ్వాసాన్ని ప్రకటించుకున్నది.

ఛాందసము, సంకుచితము అయిన వైఖరిని ప్రదర్శించు కొన్న పార్టీ వ్యతిరేక జట్టులో ఒకడైన కామ్రేడ్ మోలటోవ్

బీడు భూములను ఉపయోగించుకోవలసిన ఆవశ్యకతను గుర్తించకపోగా, మనదేశ ఆర్థిక రంగంలో బ్రహ్మాండమైన ప్రాముఖ్యతను పొందిన, 35 మిలియన్ల హెక్టర్ల బంజరు భూముల అభివృద్ధిని ప్రతిఘటించారంటే అది కాకతాళీయంగా జరిగిన విషయంగా భావించకూడదు.

వ్యక్తి ఆరాధన దుష్ఫలితాలను తొలగించడానికీ, ఇది వరకు జరిగిన విప్లవాత్మక న్యాయచట్టాతిక్రమణను అంతమొందించి, అలాంటివి మళ్ళా జరుగకుండా వుండే పరిస్థితులను కల్పించడానికీ కేంద్రకమిటీ, యావత్తు పార్టీ తీసుకొంటున్న చర్యలను కామ్రేడ్స్ మాలెంకోవ్, కగనోవిచ్, మోలటోవ్ గట్టిగా ప్రతిఘటించారు.

సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ 20వ మహాసభ తీర్మానాల ననుసరించి పార్టీ అమలు జరుపుతున్న చర్యలను కార్మికులు, సమిష్టి వ్యవసాయ క్షేత్రదారులు, ప్రతిభావంతులైన యువజనులు, మన ఇంజినీర్లు, సాంకేతిక నిపుణులు, వైజ్ఞానిక కార్యకర్తలు, రచయితలు, మేధావంతులు ఏకగ్రీవంగా బలపరుస్తుంటే, యావత్తు సోవియట్ ప్రజలు సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ వెనుక సమీకృతమవుతుంటే, ఆ చర్యలను అమలు పర్చడానికి యావత్తు సోవియట్ ప్రజానీకం చురుకుగా కృషి సల్పుతూవుంటే, మన దేశంలో ప్రజల కృషి అత్యంతంగా పెంపొందుతూ, సృజనాత్మకశక్తి అభివృద్ధి పొందుతూవుంటే ఈ పార్టీ వ్యతిరేక జట్టువారు సృజనాత్మకమైన యీ ప్రజా ఉద్యమాన్ని లెక్కచేయలేదు.

విదేశాంగ విధానం విషయంలో ఈ జట్టు, అందులోను ముఖ్యంగా కామ్రేడ్ మోలటోవ్, సంకుచితతత్వాన్ని ప్రదర్శిస్తూ, అంతర్జాతీయ ఉద్రిక్తతను సడలింపజేసి, ప్రపంచ శాంతిని పెంపొందించడానికి అత్యవసరమైన చర్యలను అమలు పర్చడాన్ని అన్ని విధాల చెడగొడుతూ వచ్చారు.

చాలాకాలం వరకు కామ్రేడ్ మోలటోవ్, తన విదేశాంగ మంత్రి పదవి హోదాలో, విదేశాంగ వ్యవహారాల శాఖద్వారా, సోవియట్ దేశం, యుగోస్లావియాల మధ్య సంబంధాలను బాగు పర్చడానికి చర్యలను తీసుకొనకపోగా, యుగోస్లావియాతో సంబంధాలను బాగుపర్చుకోడానికి కేంద్రకమిటీ అధ్యక్షవర్గం తీసుకొంటూ వచ్చిన చర్యలను పదేపదే వ్యతిరేకిస్తూ వచ్చారు. యుగోస్లావియా సమస్య విషయంలో కామ్రేడ్ మోలటోవ్ అవలంబించిన పొరపాటు విధానము "సోవియట్ ప్రభుత్వం, సోషలిస్టు శిబిరాల ప్రయోజనాలకు అనుకూలంగా లేదనీ, లెనినిస్టు సూత్రాల విధానానికి అనుగుణ్యంగా లేదనీ" 1955 జూలైలో జరిగిన సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశం ఏకగ్రీవంగా ఖండించింది.

కామ్రేడ్ మోలటోవ్, యూరపు నడిబొడ్డున వున్న ఆస్ట్రియాలో ప్రభుత్వ సంధిని జరుపుకొని, దానితో సంబంధాలను బాగుపర్చుకోడానికి అవరోధాలను కల్పించారు. ఆస్ట్రియాతో సంధి చేసుకొనబడటము మొత్తంమీద అంతర్జాతీయ ఉద్రిక్తత తగ్గడానికి చాలావరకు కారణభూతమయింది. జపానుతో సంబంధాలను మామూలు స్థితికి తెచ్చుకోడాన్ని గూడా ఆయన వ్యతిరేకించారు. ఈ మామూలు పరిస్థితులు యేర్పడడం, అప్పటి నుండీ దూరప్రాచ్యంలో అంతర్జాతీయ ఉద్రిక్తత సడలింపు విషయంలో ప్రముఖ పాత్రను వహించింది. ప్రస్తుత పరిస్థితుల్లో యుద్ధాన్ని అరికట్టడానికి గల ఆవశ్యకతను గురించీ, వివిధ దేశాల్లో వివిధ మార్గాలద్వారా సోషలిజానికి పరివర్తన చెందగల అవకాశాలను గురించీ, సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీకీ, విదేశాలలో వున్న అభ్యుదయకర పార్టీలకు మధ్య సంబంధాలను బలపర్చవలసిన ఆవశ్యకతను గురించీ పార్టీ చేసిన మౌలిక ప్రతిపాదనలను ఆయన వ్యతిరేకించారు.

కామ్రేడ్ మోలటోవ్, దేశాల శాంతిభద్రతల పరిరక్షణ విషయంలో సోవియట్ ప్రభుత్వం తప్పనిసరిగా తీసుకొనవలసి వచ్చిన కొత్త చర్యలను పదేపదే వ్యతిరేకించారు. ముఖ్యంగా, సోవియట్ నాయకులు, ఇతరదేశాల రాజకీయవేత్తలతో వ్యక్తిగత సంబంధాలు స్థాపించుకో నవసరంలేదని ఆయన అన్నారు. పరస్పర అవగాహన సాధనకూ, మంచి అంతర్జాతీయ సంబంధాలకు ఇది యేంతెనా అవసరం.

పైన చెప్పిన అనేక విషయాలలో కామ్రేడ్ మోలటోవ్ అభిప్రాయాలతో కామ్రేడ్ కగనోవిచ్, కొన్ని సందర్భాలలో కామ్రేడ్ మాలెంకోవ్ ఏకీభవించారు. కేంద్రకమిటీ అధ్యక్షవర్గము, మొత్తంగా కేంద్రకమిటీ, వారు తమ పొరపాట్ల నుండి గుణపాఠాలను నేర్చుకుంటారన్న ఆశతో, అవే విధానాలను పట్టుకు వేళ్లాడక, మొత్తం పార్టీ ప్రధాన సంఘంలో కలిసి వస్తారన్న ఆశతో, వారిని దిద్దుతూ, వారి పొరపాట్లకు వ్యతిరేకంగా పోరాడుతూ వచ్చాయి. అయినప్పటికి వారు తమ లెనినిస్టు వ్యతిరేక విధానాన్ని కొనసాగిస్తూనే వచ్చారు.

పార్టీ విధానానికి భిన్నంగావున్న కామ్రేడ్ మాలెంకోవ్, కగనోవిచ్, మోలటోవ్ దృక్పథంలో వున్న దేమిటంటే, వారు గతంలోనూ, యిప్పుడూకూడా పాత భావాలకూ, పద్ధతులకూ బందీలయ్యారు, పార్టీ జీవితంనుండి, దేశ జీవితం నుండీ దూర మెళ్ళిపోయారు; నూతన పరిస్థితులనూ, నూతన సన్నివేశాన్ని చూడలేకపోయారు, ఛాందస దృక్పథాన్ని అవలంబించారు, వాస్తవికత నుండి ఉద్భవించినదానిని, సోవియట్ సమాజ ప్రగతికి సంబంధించిన ప్రయోజనాలూ, యావత్తు సామ్యవాద శిబిర ప్రయోజనాలూ సూచించిన దానిని నిరాకరిస్తూ కమ్యూనిజం వేపుకు పురోగమనానికి యిప్పుడు అనుగుణంగా లేని, చెల్లుబడిలో లేని రూపాలనూ, పద్ధతులనూ మొండిగా పట్టుకవ్రేలాడుతారు.

దేశీయ సమస్యలూ, విదేశాంగ విధాన విషయాలూ రెండింటిలోనూ వారు సంకుచిత పాక్షికవాదులు, పిడివాదులున్నూ; వారు పాండిత్యాడంబరంతో కూడిన, జడమైన దృక్పథాన్ని మార్క్సిజం-లెనినిజానికి ఉపయోగిస్తారు. ప్రస్తుత పరిస్థితులలో, ఆచరణలోని సజీవమైన మార్క్సిజం-లెనినిజం, కమ్యూనిజానికి పోరాటం 20వ పార్టీ మహాసభ నిర్ణయాలను అమలు జరపడంలోనూ, శాంతియుత సహజీవనమూ, ప్రజల మధ్య స్నేహానికి కృషి, సామ్యవాద శిబిరాన్ని సర్వతోముఖంగా పటిష్టపరచడమూ

అన్న విధానాన్ని స్థిరంగా అమలు జరపడంలోనూ, మరింత బాగా పారిశ్రామిక నిర్వహణములోనూ, సాధ్యమైనంత సంపూర్ణంగా వ్యావసాయకాభివృద్ధికొరకూ, పుష్కలంగా ఆహారం కొరకూ, భారీ యెత్తున గృహనిర్మాణంకొరకూ యూనియన్ రిపబ్లిక్కుల హక్కుల విస్తరణకొరకూ, జాతుల సంస్కృతుల వికాసంకొరకూ, ప్రజాసామాన్యపు చొరవను సర్వతోముఖంగా ప్రోత్సహించడం కొరకూ కృషి చేయడంలోనూ వ్యక్తపడతా యన్న దానిని వారు గుర్తించలేకపోయారు. తమ తప్పుడు ప్రకటనలూ, చర్యలూ, 20వ పార్టీ మహాసభ నిర్దేశించిన విధానాన్ని ఏకరీతిని అమలు జరుపుతోన్న కేంద్ర కమిటీ అధ్యక్షవర్గంలో యెప్పుడూ వమ్ము గావింపబడడం గమనిస్తూ కామ్రేడ్స్ మోలటోవ్, కగనోవిచ్, మాలెంకోవ్ పార్టీ నాయకత్వానికి వ్యతిరేకంగా ముఠా పోరాటానికి పూనుకున్నారు. పార్టీ వ్యతిరేక ప్రాతిపదికపైని కుట్రలోనికి ప్రవేశిస్తూ, పార్టీ విధానాన్ని మార్చడానికీ, 20వ పార్టీ మహాసభ ఖండించిన తప్పుడు నాయకత్వ పద్ధతులకు పార్టీని మళ్ళీ వెనుకకు లాగుక పోవడానికీ వారు పూనుకున్నారు. వారు కుహకాల పద్ధతులను అవలంబించి, కేంద్ర కమిటీకి వ్య తి రే కం గా కుట్ర చేశారు. కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశంలో వెల్లడయిన యదార్థ విషయాలు. కామ్రేడ్స్ మాలెంకోవ్, కగనోవిచ్, మోలటోవ్, వారితో చేరిన కామ్రేడ్ షెపిలోవ్‌కూడా ముఠా పోరాటానికి పూనుకుని పార్టీ నిబంధనలనూ, లెనిన్‌చే వ్రాయబడిన "పార్టీ ఐక్యతను గురించి" అన్న 10వ పార్టీ మహాసభ నిర్ణయాన్నీ భంగపరిచారని తెలియ జేస్తున్నాయి: దానిలో యిలా వుంది: "పార్టీలోనూ, సోవియట్ పని అంతట్లోనూ కచ్చితమైన క్రమశిక్షణను తీసుకవచ్చేందుకు, ముఠా కార్యకలాపాలన్నిటిని తొలగించడంలో అత్యధికంగా ఐక్యతను సాధించేందుకు, క్రమశిక్షణకు భంగం వాటిల్లిన సందర్భాలలో, లేదా ముఠా కార్యకలాపాలు తిరిగి తలెత్తడమూ, లేదా అవి సహింపబడడమూ జరిగిన సందర్భాలలో, పార్టీనుండి తొలగింపబడడంతో బాటుగా, కేంద్రకమిటీ సభ్యుల విషయంలో వారి హోదాను ప్రత్యామ్నాయ సభ్యుల హోదాకు తగ్గించడమూ, లేదా తీవ్రచర్యగా పార్టీనుండి వారిని తొలగించడంతో సైతం అన్ని పార్టీ శిక్షలనూ వేయడానికి మహాసభ కేంద్రకమిటీకి అధికారాన్నిస్తోంది. కేంద్రకమిటీ సభ్యులపట్ల, కేంద్రకమిటీ ప్రత్యామ్నాయ సభ్యులపట్ల, కంట్రోలు కమిషన్ సభ్యులపట్ల యీ తీవ్రచర్యను తీసుకోవడానికి ముందుగా కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశాన్ని జరపాలి, దానికి కేంద్రకమిటీ ప్రత్యామ్నాయ సభ్యులందరినీ, కంట్రోలు కమిషన్ సభ్యులందర్నీ ఆహ్వానించాలి. అత్యంత బాధ్యతగల పార్టీనాయకులతో కూడిన యిటువంటి సమావేశం, ఒక కేంద్రకమిటీ సభ్యుణ్ని ప్రత్యామ్నాయ సభ్యుని హోదాకు తగ్గించవలసిన అవసరాన్ని, లేదా పార్టీనుండి అతనిని తగ్గించవలసిన ఆవసరాన్ని మూడింట రెండువంతుల మెజారిటీతో గుర్తించినట్లయితే, అప్పుడు ఆ చర్యను వెంటనే అమలు జరపాలి."

ఈ లెనిన్ తీర్మానం కేంద్రకమిటీ. అన్ని పార్టీ సంఘాలూ పార్టీ ఐక్యతను విసుగూ విరామమూ లేకుండా పటిష్టపర్చవలసిన, ముఠా కార్యకలాపాల ప్రతి రుజువునూ త్రిప్పి కొట్టవలసిన, సంయుక్త కృషిచే పని జరిగేటట్టు హామీ కలిగించవలసిన విధిని కల్పిస్తోంది; కార్మికవర్గ అగ్రగామిఅయిన కమ్యూనిస్టు పార్టీ దీక్ష కార్యాచరణల ఐక్యతను వ్యక్తపర్చుతోంది.

కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశం, ఏకగ్రీవంగా పార్టీ వ్యతిరేక ముఠాను ఖండించిన కేంద్రకమిటీ సభ్యుల, ప్రత్యామ్నాయ సభ్యుల, సోవియట్‌దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర ఆడిటింగ్ కమిషన్ సభ్యులందరి ఏకఖండ ఐక్యతనూ, సంఘీభావాన్నీ గొప్ప సంతృప్తితో గుర్తిస్తోంది. కేంద్రకమిటీ ప్లీనరి సభ్యులలో ఒక్కరుకూడా యీ ముఠాను బలపర్చలేదు.

కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశంలో యీ ముఠా పార్టీ వ్యతిరేక కార్యకలాపాలు ఏకగ్రీవంగా ఖండింపబడడంవల్ల, కేంద్రకమిటీ ప్లీనరీ సభ్యులు యీ ముఠా సభ్యులను కేంద్ర కమిటీనుండి తీసివెయ్యవలసిందిగానూ, పార్టీనుండి తొలగించవలసిందిగానూ ఏకగ్రీవంగా డిమాండు చేసిన పరిస్థితి ఏర్పడడంవల్ల, కుట్రజరగడాన్నీ, తమ పార్టీ వ్యతిరేక కార్యకలాపాల నష్టదాయకమైన స్వభావాన్నీ వారు ఒప్పుకుని, పార్టీ నిర్ణయాలను అమలు జరపడానికి అంగీకరించారు.

పైని చెప్పబడినవాటిదృష్ట్యా, పార్టీ యొక్క లెనినిస్టు ఐక్యతను సర్వతోముఖంగా సంఘటిత పర్చడానికి సంబంధించిన ప్రయోజనాలను అనుసరించి సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశం యీ విధంగా తీర్మానించింది :

1. మాలెంకోవ్, కగనోవిచ్, మోలటోవ్, తరవాత వీరిని చేరిన షెపిలోవ్ పార్టీ వ్యతిరేక జట్టు ముఠా కార్యకలాపాలు, మన పార్టీ యొక్క లెనినిస్టు సూత్రాలకు విరుద్ధమైన వాటిగా ఖండించడానికీ,

2. కామ్రేడ్స్ మాలెంకోవ్, కగనోవిచ్, మోలటోవ్‌లను కేంద్రకమిటీ అధ్యక్షవర్గ సభ్యత్వంనుండీ, కేంద్రకమిటీనుండీ తప్పించి వెయ్యడానికి, కామ్రేడ్ షెపిలోవ్‌ను కేంద్ర కమిటీ కార్యదర్శి పదవినుండి తొలగించడానికీ, ఆ య న ను కేంద్ర కమిటీ అధ్యక్షవర్గ ప్రత్యామ్నాయ సభ్యత్వం నుండి, కేంద్రకమిటీ సభ్యత్వంనుండీ తప్పించివెయ్యడానికీ.

పార్టీ కేంద్రకమిటీచే కామ్రేడ్స్ మాలెంకోవ్, కగనోవిచ్, మోలటోవ్‌ల పార్టీ వ్యతిరేక జట్టు ముఠా కార్యకలాపాలను ఏకగ్రీవంగా ఖండించడంవల్ల, మన లెనినిస్టు పా ర్టీ శ్రే ణు ల ఐక్యత యింకా సంఘటితపడుతుంది, దాని నాయకత్వం సంఘటితపడుతుంది, పార్టీ విధానంకొరకు పోరాటానికి బలం చేకూరుతుంది.

మార్క్సిజం-లెనినిజం అజేయ పతాకకు యింకా చేరువగా రమ్మనీ, కమ్యూనిస్టు నిర్మాణకర్తవ్యాలను జయప్రదంగా నెరవేర్చేందుకు యావచ్ఛక్తులనూ ఉపయోగించమనీ పార్టీ కేంద్రకమిటీ కమ్యూనిస్టులందరికి విజ్ఞప్తి చేస్తోంది.

(కేంద్రకమిటీ సభ్యులు, కేంద్రకమిటీ ప్రత్యామ్నాయ సభ్యులు, కేంద్ర ఆడిటింగ్ కమిషన్ సభ్యులూ అందరి ఏకగ్రీవమైన ఓటుతో 1957 జూన్ 29 న ఆమోదింపబడింది; కామ్రేడ్ మోలటోవ్ ఒక్కరు ఓటుచేయలేదు).



సంపుటి 8
సంచిక 14

# సోవియట్ భూమి

జూలై 25
1957.

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచార శాఖవే ప్రచురింపబడుతోన్న సచిత్ర పక్ష పత్రిక



## ఈ సంచికలో



# సోవియట్ దేశంలో నేను చూచిన కొత్త విషయాలు

## మేజర్ జనరల్ సాహెబ్ సింగ్ సోఖే

పద్దెనిమిది మాసాలకే నేను సోవియట్ దేశానికి తిరిగివచ్చినప్పటికీ, ఆ దేశం ఎంత త్వరత్వరగా నిర్మింపబడుతూ వుందం టే, నాకు ఆతిధ్యం యిచ్చినవారూ, యిటీవలనే సోవియట్ దేశానికి వచ్చిన నాదేశీయులూ అప్రయత్నంగా ఒక ప్రశ్నను వేస్తారు, నా యిప్పటి యాత్రలో నేను ఏఏ కొత్త విషయాలను చూశానని. సహజంగా నా ఆతిధ్య ప్రదాతలు తమ విజయాలపట్ల గర్వపడతారు; యీ దేశంలో నిర్మాణం సాగుతోన్న శీఘ్రగతికి ఆశ్చర్యపడ్డారు.

ఈసారి నా పనివల్ల నేను మాస్కోలోనే వుండిపోయాను. దేశంలోని యితర ప్రాంతాలకు నేను వెళ్ళలేకపోయాను. అయినా మాస్కోలో ఎన్నో కొత్త విషయాలున్నాయి, చూడడానికీ, వ్రాయడానికీ

తన చాలా విశాలమైన వీధులతోనూ, చక్కని పరిశుభ్రమైన ఆకారంతోనూ ఒక అద్వితీయ నగరంగా మాస్కో ఎవరినైనా ఆకర్షిస్తుంది. కొందరు అమెరికన్ యాత్రీకులు యిటీవల దానిని తాము చూసిన నగరాలన్నిటిలోనూ పరిశుభ్రమైనది అన్నారు. చారిత్రికమైనవీ, సుందరమైనవీ అయిన దాని భవనాలుకాక, ఆ నగర రూపంలో ఆశ్చర్యకరమైన విషయం, దాని పెరుగుదల.

లెనిన్ కొండలపైని, అద్భుతమైన మాస్కో ప్రభుత్వ విశ్వవిద్యాలయం వెనుక కార్మికులకూ, పాఠశాలలకూ వేలాది యిళ్ళతో డజన్లకొద్దీ గృహాల బ్లాకులతో అందమైన ఒక కొత్త నగరమే నిర్మింపబడింది. అక్కడ యీ మధ్యనే ఒక యిల్లు యివ్వబడిన మా దేశీయురాలు ఒకామెను చూడడానికి వెళ్లేఅవకాశం నాకుకలిగింది. గత ఏడాదిలో భారతదేశం నుండి 150మందికి పైగా యువతీయువకులు మాస్కో రేడియోలోనూ, విదేశ భాషా ప్రచురణాలయంలోనూ పని చేయడానికి మాస్కోకు వెళ్ళారు.

బహు కుటుంబ నివాస యోగ్యమైన పెద్ద పెద్ద గృహాలు మొజైస్కాయి అవెన్యూ వెంబడిని నిర్మింపబడుతూ వుండడంకూడా నేను చూశాను. మోస్కోలోని అందమైన పైన్ చెట్ల అడవిలోవున్న సదుపాయమైన చక్కని ఆరోగ్యమందిరానికి వెళ్ళడానికి నేను దీనిగుండా నగరంనుండి బయలుదేరాను. నా కుడికాలులోని నొప్పికి యిక్కడ నేను చికిత్సను పొందుతున్నాను. ఆ రహదారి వెంబడిని నగరానికి కొద్ది కిలోమీటర్లకు అవల యింకో రెండు పెద్దనగరాలు త్వరత్వరగా నిర్మింపబడుతూ వున్నాయి. నగరం చుట్టూరా యివే కార్యకలాపాలను నేను చూశాను.

తరవాత లక్షమంది ప్రేక్షకులకు పైగా వసతిగల అద్భుతమైన కొత్త లెనిన్ స్టాడియం వుంది. దానిలో యీత చెరువులూ, వ్యాయామశాలలూ, టెన్నిస్, వాలీ-బాల్ కోర్టులూ వున్నాయి.

ఈ కార్యకలాపాలన్నీ కార్మికులకు మంచి జీవన, సాంస్కృతిక పరిస్థితులను ఏర్పర్చుతాయిగాబట్టి, యిదంతా గణనీయమైనది, చాలా హర్షించవలసినది. కాని సోవియట్ దేశంలో కొత్తది యిదొక్కటేకాదు. సోవియట్ దేశ సుప్రీం సోవియట్ ఆఖరు సమావేశం, కేంద్ర మంత్రివర్గంలో (మంత్రిమండలి) విజ్ఞాన శాస్త్రానికీ, టెక్నాలజీకీ నేరుగా ప్రాతినిధ్యం యివ్వడానికి నిర్ణయించింది. భవిష్యత్తులో విజ్ఞానశాస్త్ర, సాంకేతిక సంఘాధ్యక్షుడు, కేంద్ర స్టాటిస్టికల్ బోర్డు ప్రధాని, సోవియట్ దేశ ప్రభుత్వ ప్లానింగ్ కమిషన్ ముఖ్య శాఖల ఉపాధ్యక్షులు (అధ్యక్షుడు యిప్పటికే సభ్యుడు కావడంవల్ల), ప్రధానాధికారులూ కేంద్ర మంత్రివర్గంలో సభ్యులుగా వుండాలని అది శాసనం చేసింది. ఇదేవిధంగా రిపబ్లిక్కుల సోవియట్లలో యిటువంటి స్థానాలలో వున్న విజ్ఞాన శాస్త్రజ్ఞులంతా, రిపబ్లిక్కుల మంత్రివర్గాలలో సభ్యులుగా వుంటారు.

కేంద్ర మంత్రివర్గంలోనూ, రిపబ్లిక్కులలోని మంత్రివర్గాలలోనూ విజ్ఞానశాస్త్రానికి నేరుగా ప్రాతినిధ్యాన్ని యివ్వడం, నూతన విషయం, చాలా ముఖ్యమైన చర్య. విజ్ఞానశాస్త్రం నేడు చాలా బలవత్తరమైన శక్తి. అది మానవుని ఉత్పత్తి శక్తిని పెంచుతూ వుండడం మాత్రమే కాకుండా, యావత్తు మానవజాతికి ఉన్నతమైన జీవన, సాంస్కృతిక ప్రమాణాల సృష్టిని సాధ్యంచేస్తూ వుండడం మాత్రమే కాకుండా, యింతగానూ ముఖ్యవిషయమేమిటంటే, యిది అత్యున్నతమైన మానవ విలువలను ఉద్భవింపజేస్తుంది, మనిషిపట్ల మనిషి, దేశంపట్ల దేశం ప్రవర్తించే తీరును సహేతుకమైన ప్రాతిపదికపైని వుంచుతుంది.

విజ్ఞానశాస్త్రం ప్రాముఖ్యతను పూర్తిగా గుర్తించి, దానిపైని తన జీవితాన్ని నిర్మించుకున్న మొదటి దేశం, సోవియట్ దేశం. సోవియట్ దేశంలో విజ్ఞానశాస్త్రమూ, టెక్నాలజీ పాఠశాలల్లోనూ, విశ్వవిద్యాలయాలలోనూ అతి ముఖ్య హంశాలు చేయబడ్డాయి. దీని ఫలితంగా యిప్పుడు సోవియట్ దేశం ఏటాదికేడాది ఎక్కువమంది విజ్ఞానశాస్త్రజ్ఞులనూ, ఇంజినీర్లనూ పశ్చిమ యూరప్, అమెరికా కలిపి చేసినదానికంటె అధికంగా తయారు చేస్తోంది. ఈ వైజ్ఞానిక, సాంకేతిక ప్రతిభ, యుద్ధం తన అంగబలాన్ని, ఫాక్టరీలు, సమిష్టి క్షేత్రాలను చాలా ఎక్కువగా నష్టపరిచినప్పటికీ, గత నలభై ఏళ్ళలో సోవియట్ దేశం తన ఉత్పత్తిని ముప్ఫయిరెట్లు ఎక్కువ చేసుకునేందుకు అవకాశాన్ని యిచ్చింది.

ఇంతకంటె అధికమైన విషయమేమిటంటే, సోవియట్ దేశం వైజ్ఞానిక సంస్కృతిని సృష్టిస్తోంది. ఇంతవరకూ మనిషికీ మనిషికీమధ్య, దేశాలకు దేశాలకు మధ్య సంబంధాలు అహేతుకమైన ప్రాతిపదికపైని ఆధారపడి వున్నాయి; దాని ఫలితంగా అతివినాశకరమైన ఫలితాలు కలుగుతున్నాయి. మనిషి మంచిచెడ్డల విచక్షణా జ్ఞానంతో పుట్టాడని ప్రజలు విశ్వసించారు. అంతర్గతమైన యీ విలువలను అనుసరించాలి, వాటిని ప్రశ్నించకూడదు, పరీక్షించకూడదు. బ్రాహ్మణుడు బ్రాహ్మణేతరునికంటె, సహజంగా అధికుడని విశ్వసింపబడేది. శూద్రుడు జీవితంలో తనస్థాయిని పెంచుకోడానికి చేసే యేప్రయత్నమైనా తప్పు. తెల్లవాడు పుట్టుకతో శ్వేతేతరునికంటె అధికుడు, తాను కష్టపడకుండా సుఖంగా వుండేందుకు శ్వేతేతరుని కష్టించేటట్టు చేయడం సరిఅయిన పనే. దీని ఫలితంగా వచ్చిన అస్పృశ్యత, వలస విధానం, దురాక్రమణ యుద్ధాలూ మనకు తెలిసినవే.

విజ్ఞానశాస్త్రం అలా కాకుండా, మంచి చెడ్డలకు బాహ్యమైన (ఆబ్జెక్టివ్), పరీక్షకాగే ప్రాతిపదికలను చూపుతుంది; వ్యక్తులమధ్య, దేశాలమధ్య సంబంధాలను హేతుబద్ధం కావిస్తుంది. వైజ్ఞానికానుభవం కలుగజేసే మొదటి విషయం, బాధ్యతాభావం. వైజ్ఞానిక కృషి అంతా, అతి మౌలికమైన పరిశోధనలుకూడా చాలామంది చేసే సమిష్టి కృషి ఫలితాలని ప్రతి విజ్ఞానశాస్త్రజ్ఞుడూ ఎరుగును. వాస్తవానికి జ్ఞానమంతా ఉమ్మడిగా నిర్మింపబడినట్టిది. ఈ సమిష్టికృషి సుసాధ్యమూ, ఫలప్రదమూ కావడానికి, సత్యాన్ని చెప్పడం పూర్తిగా అవసరం. తరవాత విజ్ఞానశాస్త్రజ్ఞుడు కొత్త విషయాలను కనుగొనడానికి కృషిచేస్తూ వున్నప్పుడు, అతను పరిశీలనా స్వాతంత్ర్యమూ, ఆలోచనా స్వాతంత్ర్యమూ పెంపొందించుకోవాలి. వాస్తవానికి అతను తనకాలంలో విశ్వసింపబడే అభిప్రాయాలతో, అతి పవిత్రమైన అభిప్రాయాలతో కూడా నిరంతరం అసమ్మతి తెలుపుతూ పోవాలి. కాని యీ అసమ్మతి ప్రకటనకు వ్యక్తులుగా విజ్ఞానశాస్త్రజ్ఞులు స్వతంత్రులై వుండాలి, విజ్ఞానశాస్త్రజ్ఞుల సముదాయం సహనం కలిగివుండాలి. యితరుల కృషిపట్ల న్యాయబుద్ధి వుండాలి. పురోగతిని సాధ్యపరచిన మహా కృషి చేసినవారిని—వారి విశ్వాసాలు ప్రస్తుతం అంగీకరింపబడకుండా వున్నప్పటికీ—గౌరవించాలని, యిది విజ్ఞానశాస్త్రజ్ఞులకు బోధిస్తుంది కూడా. ఈ ఉన్నత గుణాలను పెంపొందించుకోవడానికి వ్యక్తికి ఆత్మగౌరవం వుండాలి.

ఈ విధంగా, వైజ్ఞానిక భావం—స్వాతంత్ర్య భావంతోను, సహనంతోను ప్రారంభమై, యిటీవల ఒక ప్రఖ్యాత బ్రిటిష్ విజ్ఞాన శాస్త్రజ్ఞుడు అన్నట్టుగా, అసమ్మతి, ఆలోచనా, వాక్స్వాతంత్ర్యం, న్యాయం, గౌరవం, మానవుని మానం, ఆత్మగౌరవం అనే ఉన్నత గుణాలను పెంపొందిస్తుంది, ఇవి నిజంగా చాలా ఉన్నతమైన మానవ విలువలు. సోవియట్ దేశం తన విద్యావిధానం, సాంఘిక ఆచరణల ద్వారా, వైజ్ఞానిక భావనచే నడుపబడే వైజ్ఞానిక సంస్కృతిని సృష్టి చేయడానికి పాటుపడుతోంది. కేంద్ర, రిపబ్లిక్ మంత్రివర్గాలలో విజ్ఞాన శాస్త్రజ్ఞులకు ప్రాతినిధ్యాన్ని యివ్వడం, యీ లక్ష్య సాధనకు చేసిన ఒక చర్య.

[మిగత 39వ పుటలో]

# యువజనులు బలవత్తరులు

## వాసిలీ జకర్చెంకో

నా వయస్సు నలభై ఏళ్లు: కాని అదే కాలములో నా దేశపు అనుభవంతో సరిపోల్చితే నా అనుభవం ఏపాటిది ?

నేను పుట్టిన సంవత్సరంలో, మా దేశ ప్రజలు గతాన్ని శాశ్వతంగా వెనుకకు నెట్టివేసి, అధికారాన్ని స్వాయత్తం చేసుకున్నారు. రష్యాలో 1917 లో జరిగిన మహా విప్లవం గురించి నేను ప్రస్తావిస్తున్నాను.

ఈ సంఘటన ప్రజల గతిని మార్చివేయడం మాత్రమే కాకుండా, పరిశ్రమ, టెక్నాలజీ, విజ్ఞాన శాస్త్రాల గమనాన్ని చాలా మార్చి వేసినది. మాస్కోలోని పిల్లల అభిమాన పత్రిక "యువజనుల టెక్నాలజీ" అన్న దానికి నేను సంపాదకుడను. ఇంజినీరుగానూ, రచయితగానూ విజ్ఞానశాస్త్రంలోనూ, టెక్నిక్స్‌లోనూ మా దేశానికి లేనివాటిని గురించి, తరవాతను మేము సంపాదించినవీ, గత నాలుగు దశాబ్దాలలోనూ ప్రపంచంలో మాకు ఒక అగ్రస్థానాన్ని సంపాదించినవీ అయిన విషయాలను గురించి మీకు చెప్పదలుచుకున్నాను.

మా రాజ్య స్థాపకుడైన మహా పురుషుడు వ్లాడిమిర్ లెనిన్, సోవియట్ రష్యా జీవితంలో తొలి సంవత్సరాలలో, ఒక శీతాకాలపురోజున ప్రఖ్యాత బ్రిటిష్ గ్రంధకర్త హెచ్.జి.వెల్స్‌ను కలిశారు. వైజ్ఞానిక కల్పనా నవలా రచయితగా వెల్స్ పేరు పడ్డారన్నది తెలిసిన విషయమే. భవిష్యత్తువిషయమై లెనిన్ స్వప్నాన్ని ఆయనకంటె ఎక్కువగా ఎవరూ గ్రహించలేరేమో నని అనిపించేది వెచ్చదనపు ఏర్పాట్లు లేని అతి చలిగా వున్న శిధిలాలతో నిండిన ఆ మాస్కోలో సైతం లెనిన్ వీటి గురించి ఆ బ్రిటిష్ రచయిత ఎదుట లెనిన్ కలలు గన్నారు. ఆయన విద్యుదీకరణగురించి ప్రసంగించారు, రైతులు తమ భూములను ట్రాక్టర్లతో సేద్యం చేస్తారన్నారు, ప్రజలందరూ చదువుకుని విద్యావంతులవుతారన్నారు. కాని హెచ్. జి. వెల్స్, భవిష్యత్తుగురించి ఆశ్చర్యకరమైన ఎన్నో గ్రంధాలను వ్రాసిన ఆ వ్యక్తి, లెనిన్‌ను అర్థం చేసుకోలేకపోయారు. ఆయనను నమ్మలేకపోయారు.

లెనిన్ కల సఫలమయ్యిందా లేదా అని సరి చూచుకోవడానికి, నాలుగు దశాబ్దాలకాలం చాలును. గ్రామసీమలను పరివర్తనం గావించే లక్ష ట్రాక్టర్ల గురించి ఆయన కలలుగన్నారు. రష్యాకు ఏ ట్రాక్టరు పరిశ్రమ లేని రోజుల్లో అందువల్ల యీ అంకెలు పూర్తిగా అసందర్భాలుగా వున్నరోజుల్లో ఆయన యిది ఆలోచించారు. నేడు మాదేశానికి పదిహేను లక్షల ట్రాక్టర్లున్నాయి. యివన్నీ సోవియట్ ఫాక్టరీలలో తయారు చేయబడినవే; యిప్పుడవి సోవియట్ సమిష్టి క్షేత్రాలలో పనిచేస్తున్నాయి. కాటర్‌పిల్లర్ ట్రాక్టర్లను తయారు చేస్తూన్న స్టాలిన్‌గ్రాడ్ పరిశ్రమ ట్రేడ్‌మార్కు, దేశంలోని అన్ని ప్రాంతాలకూ పంపడానికి ఉద్దేశింపబడిన భారీ ట్రాక్టర్లను తయారుచేసిన ఛెల్యబిన్‌స్క్ ట్రాక్టరు పరిశ్రమ ట్రేడ్‌మార్కు, వ్లాదిమిర్, క్రార్కోవ్, యిటువంటివే యితర పరిశ్రమలవీ ట్రేడ్‌మార్కులూ సర్వప్రపంచానికీ తెలిసినవే.

ఇంతేకాకుండా, సోవియట్ దేశపు పొలాలలోని బ్రహ్మాండమైన యీ ఉక్కు యంత్రాలు చిన్న రైతుల గుర్రాలు ఒకప్పుడు కట్టబడిన కర్రనాగళ్ళను లాగవు; అవి సరికొత్త యంత్రసామగ్రిని లాగుతాయి. ఈ యంత్రాల్లో చాలా కష్టమైన పనులను పూర్తిగా తొలగించి వేశాయి. ఉదాహరణకు, పత్తిని ఏరే యంత్రాల ప్రావీణ్యం ఆశ్చర్యకరమైనది. ఉజ్బెకిస్తాన్ సమిష్టి రైతులు వీటిని "తెలివైన"యంత్రాలనడం అకారణమేమీ కాదు. జార్జియా



బైలో రష్యన్ సమాఖ్యలో మిన్‌స్క్ మోటార్‌కార్ కర్మాగారం "ఎం ఏ జడ్-530" అనే ఈ 40-టన్ టిప్ లారీని తయారుచేసింది. దీనికి 450 అశ్వశక్తి గలిగిన మోటారు అమర్చబడింది. ఈ లారీ పొడవు 10 మీటర్లకు పైగావుంది. వెడల్పు 3.5 మీటర్లు, వేగం గంటకు 30 కిలోమీటర్లు



ఉజ్బెక్ సమాఖ్యలోని "మయవ్" ప్రభుత్వ సమిష్టి క్షేత్రంలోని జల్దరు పండ్ల తోటలకు విమానం మీదనుంచి మందు చల్లుతోన్న దృశ్యం
(ఫెర్గనా మండలంలోని కువాసీ జిల్లా)



మాస్కో. వ్నుకోవో విమానాశ్రయంలో — "టియు-104"

తోటల్లో తేయాకును ఏరే యంత్రాలను గంటల తరబడి చూస్తూ వుండిపోవచ్చును. ఈ యంత్రం చాలా విలువైన ఆకులను మాత్రమే కోస్తుంది. ఆలోచనగల వ్రేళ్ళు తమకు కావలసినవాటిని మాత్రమే తీసుకున్నట్టు. మొక్కజొన్నకోతకు, ధాన్యం, బంగాళా దుంపలు నాటడానికి, తీపి దుంపలనూ, నారనూ నూర్చడానికి, గడ్డిని తయారు చేయడానికి, ఎరువును వేయడానికీ కొత్తయంత్రాలున్నాయి. పూర్వం ఎన్నడూలేని, ఒక్క సోవియట్ పరిశ్రమ నుండి మాత్రమే ప్రపంచంలోనికి వచ్చిన యంత్రాలను మా వ్యవసాయం సంపాదించింది.

మోటారుకారు పరిశ్రమ గురించి కూడా యిదే చెప్పవచ్చును. జారిస్టు రష్యాకు స్వంత మోటారుకార్లు లేవు. అది విదేశాలనుండి దిగుమతి చేసుకునేది. కాని యిప్పుడు సోవియట్ దేశంలోని రహదారులమీదా, రోడ్లమీదా మినియన్ల కొద్దీ మోటారుకార్లు, లారీలూ వున్నాయి. ఇతర దేశాల రోడ్లమీద కూడా తరచుగా సోవియట్ మోటారు కార్లనూ, లారీలనూ చూడవచ్చును. ఈ యంత్రాలలో మాస్కో ఆటో మొబైల్ పరిశ్రమ తయారు చేసిన "మాస్కోవిచ్" వంటి చిన్నకార్లూ, మిన్స్కు పరిశ్రమ తయారు చేసిన నలభై టన్నుల "మాజ్-530" వంటి పెద్ద లారీలూ వున్నాయి. మా పరిశ్రమ మోటాను కార్లను అన్ని పనులకూ తయారు చేస్తుంది: మట్టినీ, గృహ నిర్మాణ వస్తువులనూ రవాణాచేసేందుకు స్వయంచోదకంగా వస్తువులను దింపే సాధనాలతో లారీలూ, రోడ్లులేనిచోట పనిచేయడానికి ఉద్దేశింపబడిన గ్రామాల నిమిత్తమై యంత్రాలూ, కాంక్రీటు ప్రీఫాబ్రికేటెడ్ బ్లాకుల రవాణా నిమిత్తమై పెద్ద లారీలూ, అద్భుతమైన ప్రయాణీకుల కార్లూ. ఇందులో ముఖ్యముగా గమనించవలసిన విషయం, సోవియట్ దేశంలో మోటారుకారు పరిశ్రమ సోవియట్ రాజ్యపు బిడ్డ, యీ నలభై ఏళ్ళలోనే అది పెరిగి పెద్దదయింది.

ఇటువంటి యింకో బిడ్డ విమాన పరిశ్రమ.

గత ఏడాది ప్రపంచ సాంకేతిక సారస్వతములో సోవియట్ ప్రయాణీకుల విమానం టియు-104 ఎటువంటి ఆశ్చర్యాన్ని కలుగజేసింది! అద్భుతమేమీలేదు. గంటకు సుమారు వెయ్యి కిలోమీటర్ల వేగంతో ప్రయాణంచేస్తూ ఒక ఖండంనుండి యింకో ఖండానికి అది వియత్తలం గుండా అనేకమంది ప్రయాణీకులను తీసుకవెళ్తుంది. ఉత్సాహంతైన పత్రికా రచయితలు యీ విమానం. కాలం కంటె వేగంగా పోతుందన్నారు. వాస్తవమేమిటంటే యిది శబ్దవేగంతో పోటీపడుతోంది.

మాస్కోలో జరిగిన ఒక విమాన ప్రదర్శనలో ఊర్ధ్వంగా లేచి, కొద్దిపాటి జాగాలో దిగగల హెలికాప్టరును చూసి నేను చాలా ఆశ్చర్యపడ్డాను. ఒక లారీని పెట్టుకుని ఎత్తగలదని చెపితే యీ యంత్రాలశక్తి గురించి తెలుస్తుంది. విదేశీయుల టెక్నాలజీమీద పూర్తిగా ఆధారపడిన పాత రష్యా యిటువంటి యంత్రాలను తయారుచేయగలనని ఎన్నడైనా కలలు గన్నదా? లేదని చెప్పనక్కరలేదు!

ఎన్నో విద్యుత్కేంద్రాలు చవకగా విద్యుచ్ఛక్తిని తయారు చేస్తూవుండడంవల్ల, నిర్మించి పెంపొందింప బడిన అల్యూమినియం పరిశ్రమను కూడా మేము సృష్టించాము. అందువల్ల, ద్నిప్రొగెస్ వంటి విద్యుత్కేంద్రాల

సమిష్టిక్షేత్రంలోని-తేయాకును ఏరే యంత్రం





వెంబడివి—యిది వ్లాదిమిర్ లెనిన్ ఆజ్ఞాను సారంగా నిర్మింపబడింది—తొలి సోవియట్ అల్యూమినియం పరిశ్రమలు లేచాయంటే ఆశ్చ ర్యమేమీ లేదు.

కృత్రిమ రబ్బరునూ, ప్లాస్టిక్ వస్తువులనూ తయారుచేసే రసాయనిక పరిశ్రమ, సహజ వస్త్రాలకంటె బట్టలను యెంతో గట్టిగానూ, మన్నికగలవిగానూ చేయగల యీ పరిశ్రమ. కూడా యీ నాలుగు దశాబ్దాల కాలంలో మాత్రమే వెలిసింది.

కాని సోవియట్ విజ్ఞానశాస్త్రం, టెక్ని క్కులు నలభై ఏళ్ళ చరిత్రలో వచ్చిన అత్యా శ్చర్యకరమైన, ప్రముఖమైన సృష్టి, ఒక అతి నూతనమైన పరిశ్రమ—పరమాణు పరిశ్రమ. ఒక పరమాణుశక్తి కేంద్రం ఉత్పత్తి చేసిన విద్యుచ్ఛక్తివల్ల యిప్పుడు సైతం, మా దేశపు విద్యుత్ వ్యవస్థ కొంతవరకూ నడుస్తూ వుండ డము ఆశ్చర్య పడవలసిన విషయం. పారి శ్రామికోపయోగం కోసం ప్రథమ పరమాణు శక్తి కేంద్రం, మాస్కోకు సమీపంలో మూడేళ్ళ క్రితం నడవడం మొదలైంది. దాని ఉత్పత్తి చాలా ఎక్కువేమీకాదు, కాని దానివి నిర్మించేటప్పుడూ, నడిపేటప్పుడూ గడించిన అనుభవం మాత్రం గొప్పది. విజ్ఞాన శాస్త్ర జ్ఞుల, టెక్నిషియన్ల మధ్య ఫలప్రదమైన సంప్ర దింపుల ద్వారా సేకరింపబడిన యీఅనుభవం, భావిష్య జోస్యం చెప్పడానికి మనకు హక్కు నిస్తుంది.

ఓల్గాపైనున్న కుయిబిషెవ్, స్టాలిన్‌గ్రాడ్ జల విద్యుత్కేంద్రాలూ, సైబీరియన్ మహా నదులపైనున్న కేంద్రాలూవంటి బ్రహ్మాండమైన పరిశ్రమలనుండి సంపాదించిన దేశపు మొత్తం విద్యుచ్ఛక్తిలో, పరమాణుశక్తి కేంద్రాలకు ఉచితమైన స్థానంవుంది. 1960 నరికి "శాంతి యుతమైన పరమాణువు" సోవియట్ దేశపు ఆర్థిక విధానానికి 2 నుండి 2.5 మిలియన్ల కిలోవాట్లను యిస్తుంది.

కొద్ది సోవియట్ పారిశ్రామిక శాఖల గురించి మాత్రమే నేను పేర్కొన్నాను. వాటి లోని అతిప్రస్ఫుటమైన విషయమేమిటంటే, అవి, యావత్తు సంపదలూ ప్రజలకు చెంది వున్న దేశంలో, గత నాలుగు దశాబ్దాలలో మాత్రమే ఉద్భవించాయి. కోట్లాది మంది





వచ్చే కొద్ది ఏళ్ళలో ఎన్నో పరమాణు శక్తి కేంద్రాల ప్రారంభాన్ని, రెండులక్షల కిలోవాట్లు, అంతకంటె యెక్కువగానూ కేంద్రాల ప్రారం ప్రజల చొరవను అపారంగా ప్రోత్సహించిన, సోవియట్ ఆర్థిక విధానంలోని యీ చివరి లక్షణమే బహుశా, సృజనాత్మక కృషికి ప్రథ మాశ్యకమైన శక్తిని యిచ్చింది. నలభై ఏళ్ళు మనిషి జీవితంలో అర్ధభాగం; అపారగతిలో వృద్ధి చెందుతోన్న ఒక దేశం విషయంలో, నాలుగు దశాబ్దాలు దాని ఆత్మ విశ్వాసంగల మంచి భవిష్య త్తుగల యువజనులకు మాత్రమే అవి ప్రాతినిధ్యం వహిస్తాయి. యువజనులు బలవత్తరులు.



# 32



రచన: ద్మిత్రీ త్రుని

దగెస్తాన్, కకాసస్‌లోని ఒక చిన్న రిపబ్లిక్కు. అంటే కొండ దేశమని అర్థం.

ఈ దేశానికి యింకో పేరు కూడా వుంది. అరబ్ యాత్రికులు మధ్యయుగాలలో దీనిని భాషల కొండని అన్నారు. ఈ పేరు అర్థవంతమైనదే. ఏభై వేల చదరపు కిలోమీటర్ల ప్రదేశంలో ముప్పయి రెండు జాతులు నివసిస్తున్నాయి. కొన్ని జాతులు చాలా చిన్నవి కావడం వల్ల, అవి ఒకటి రెండు కొండ గ్రామాల్లో మాత్రమే నివసిస్తూ వున్నాయి.



కొండలలోని గ్రామం ఛోఖ్‌లో, కవి గాజా బిలోవ్ తన గీతాలను తోటి గ్రామీణులకు వినిపిస్తోన్న దృశ్యం

గతంలో దగెస్తాన్ పర్వత వాసులు పోట్లాడుకునేవారు. జాతులమధ్య తగాదాలూ, స్పర్ధలు చాలా తరచుగా రక్తపాతాలకు దారితీసేవి. రష్యన్ జారిజం వివిధ జాతులలో స్పర్ధలను రేకెత్తించేది; యీ విధంగా, వలస ప్రజలను అణచివుండడం తేలికయ్యేది.

దగెస్తాన్లో సోవియట్ రాజ్యము 1920 లో స్థాపింపబడింది. రష్యన్ సమాఖ్యలో చేర్చబడిన స్వపరిపాలిత సోవియట్ రిపబ్లిక్ అయ్యింది, దగెస్తాన్. ఈ కొండ దేశంలోని వివిధ జాతుల ప్రజలు, సోవియట్ జాతుల ప్రజల యావత్తు కుటుంబంతో బాటుగా నవజీవన నిర్మాణాన్ని ప్రారంభించారు.

అక్టోబరు విప్లవం కాలువ నిర్మాణం, దగెస్తాన్‌లోని జాతుల ప్రజల మధ్య తగాదాలనూ, స్పర్ధలనూ తొలగించడానికి గొప్ప చర్య. అవర్స్, దర్గిన్స్, లాక్స్, లెజ్‌గియన్స్‌తోబాటుగా వేలాది మంది పర్వతవాసులు, 60 కిలోమీటర్ల పొడవుగల సేద్యపుకాలువ నిర్మాణానికి తోడ్పడేందుకు, కొండలలోని తమ గ్రామాలనుండి దిగి వచ్చారు. వారు మహోత్సాహంతో పాటుపడ్డారు, వారి సమిష్టి కృషికి ప్రభుత్వం దగెస్తాన్‌కు ఆర్డర్ ఆఫ్ ది రెడ్ బేనర్ ఆఫ్ లేబర్‌ను బహూకరించింది. ఇది స్నేహానికి గణనీయమైన ప్రథమ ఫలితం.

ఏళ్ళు గడిచాయి, మైత్రి దిట్టపడింది

✿



నూనె కార్మికుల ఉద్యానంలోని పుస్తక విపణి—మఖచ్‌కలా



# త్రుల దేశం-దఘిస్తాన్

రూ చిత్రాలు: ఎం. అల్పెర్ట్

పూర్వం రష్యా సరిహద్దుల్లోని వెనుక బడిన దేశమైన దగెస్తాన్ స్వంత పరిశ్రమలను—నూనె, గాజు, రసాయనిక, ఇంజినీరింగ్, కానింగ్ పరిశ్రమలను పెంపొందించుకోవడం మొదలుపెట్టింది. కొత్త నగరాలు నిర్మింపబడ్డాయి.

ఒక పెద్ద ట్రెసెల్—యిది సోవియట్ దేశంలో మొదటిది—ఇజెర్‌బాష్ వద్ద, సరిగ్గా కాస్పియన్ సముద్రంలోనికి, నీటి అడుగునుండి నూనెను తీయడంకోసం నిర్మింపబడింది. దగెస్తాన్ పర్వత వాసులు నూనె, బట్టల కార్మికులు, యంత్ర నిర్మాతలు, గాజును తయారు చేసేవారూ, జలశక్తి నిర్మాణకార్మికులూ అయ్యారు. వారు కార్మికులు మాత్రమే అవలేదు. చాలామంది లెనిన్‌గ్రాడ్‌కు, మాస్కోకూ, రోస్తవ్‌కూ, బాకూకూ వెళ్ళారు. విశ్వ విద్యాలయాలలోనూ, విద్యాశాలల్లోనూ ఉన్నతవిద్యను పొంది, తరవాత తమ పర్వత ప్రదేశాలకు ఇంజినీర్లుగా తిరిగివచ్చి కొత్త ఫ్యాక్టరీలనూ, మిల్లులనూ జలశక్తి పరిశ్రమలనూ నిర్మించేందుకు.

దగెస్తాన్‌కు స్వంత ఉన్నత విద్యాసంస్థలుకూడా వున్నాయి. మకచ్కలాలోని నాలుగు ఉన్నత విద్యాసంస్థలలో దగెస్తానున్ చెందిన అన్ని జాతులవారూ వైద్యులు, పశువైద్యులూ, వ్యవసాయ శాస్త్రజ్ఞులు, జంతు శాస్త్రజ్ఞులూ, ఉపాధ్యాయులూ కావడానికి చదువుతున్నారు. ఉపాధ్యాయులలో డాక్టర్స్ అఫ్ సైన్స్. మాస్టర్స్ అవ్ సైన్స్ చాలా మంది వున్నారు; వీరు దగెస్తాన్ నివాసులే. దగెస్తాన్ వాసులలో కొందరు దేశం అంతటా పేరు ప్రఖ్యాతులు పొందారు.

దగెస్తాన్లో రైతులమాట ఏమిటి? వారు సమిష్టి క్షేత్రాల్లో చేరారు. వ్యవసాయం అధికంగా యాంత్రికం చేయబడుతోంది. ముప్పయికి పైగా మెషిన్ ట్రాక్టరు స్టేషన్లు, యాంత్రికీ కృతమైన పశుప్రజనన క్షేత్రాలూ రిపబ్లికులో వున్నాయి. పొలాల్లోని పని యించుమించుగా అంతా—ధాన్యం, గడ్డికోత, ఇరిగేషన్ వసతులను విస్తరింప జేయడం మొదలైనవి—యంత్రాలచే చేయ



ఛోఖ్ గ్రామానికి సొంత నీటి సరఫరా కేంద్రం వున్నది



మక్చకలాలో మోటార్ సైకిలు త్రొక్కడం నేర్చుకునేవారికి శిక్షణ యివ్వబడుతున్న దృశ్యం



లెనిన్‌గ్రాడ్ సంగీత విద్యాలయంలో పట్టభద్రతానంతర శిక్షణ పొందుతున్న ఒక విద్యార్థి, దఘెస్తాన్ గ్రామంలోని ఒక జానపద గీతం స్వరాన్ని వ్రాసుకుంటున్న దృశ్యం

బడుతుంది. పళ్ళ తోటల్లో కూడా యంత్రాలు ఉపయోగింపబడతాయి. దగెస్తాన్లో పశుప్రజననం, వ్యవసాయంలో ముఖ్యశాఖ. లక్షలకొలదీ గొర్రెలు ఉన్నత ప్రదేశాలలోని పచ్చికబయళ్ళలో మేస్తాయి.

తన వివిధ జాతుల ప్రజల మైత్రి ఫలితంగా యీ పర్వత దేశానికి వికసిస్తోన్న కళలూ, పెంపొందుతోన్న సారస్వతమూ వున్నాయి. లెజ్‌గియన్ అషుగ్ (కవి) సులైమాన్ స్టాల్‌స్కీ పేరు—రష్యన్ మహారచయిత మాక్సిం గోర్కీ యీయనను 20వ శతాబ్దపు హోమర్ అన్నారు—సోవియట్ దేశంలో మాత్రమే కాకుండా, దానికి చాలా అవలకూడా ప్రసిద్ధికెక్కింది. దగెస్తాన్ ఉత్తమ కవుల కావ్యాలు, నవజీవితాన్నీ, వివిధ జాతుల ప్రజల మైత్రినీ కీర్తిస్తూ గానం చేసేవి, దగెస్తాన్లోని భాషలన్నిట్లోనూ, రష్యన్ భాషలోకూడా ప్రచురింపబడ్డాయి. దగెస్తాన్ సారస్వతంలో మైత్రి ఒక ముఖ్య వస్తువు.

దగెస్తాన్‌కు నాలుగు ప్రభుత్వ నాటక శాలలున్నాయి. అవి స్థానిక నాటక కర్తలూ, ఉత్తమ రష్యన్, విదేశీ గ్రంథకర్తలు రచించిన నాటకాలను ప్రదర్శిస్తాయి. ఇటీవల కుమిక్ నాటకశాల రవీంద్రనాథ టాగూర్ రచించిన నవల "నౌకాభంగం"ను అనుసరించి వ్రాయబడిన "గంగాపుత్రిక" అన్న నాటకాన్ని ప్రదర్శించింది.

ఇంచుమించు దగెస్తాన్లోని ప్రతి గ్రామానికీ ఒక మొబైల్ సినీమా ప్రొజెక్టర్, రేడియోలూ, గ్రంథాలయాలూ, పఠనమందిరాలూ, క్లబ్బులూ వున్నాయి. ఈ పర్వత దేశంలో సుమారు ఏభై రిపబ్లిక్, జిల్లా వార్తాపత్రికలు వివిధ దగెస్తాన్ భాషల్లో ప్రచురింపబడుతున్నాయి. దగెస్తాన్ జనాభా యించుమించుగా అంతా యిప్పుడు అక్షరాస్యులే.

జాతులమధ్య పూర్వపు తగాదాలూ, స్పర్ధలూ యిప్పుడు మచ్చుకైనా లేకుండా పోయాయి. దగియన్లు, అవర్లు, తృఖుర్లు, తబసరన్లు, లాక్‌లు, కుమ్యక్‌లూ కలసి దగెస్తాన్ సుప్రీం సోవియట్ సమావేశాల్లో జాతీయ ప్రాముఖ్యంగల విషయాలను నిర్ణయిస్తారు.

జారిస్టు రష్యాకు చెందిన పూర్వపు సరిహద్దు ప్రదేశాల ప్రజలకు, తమ అభివృద్ధిలో శిఖరాలను అందుకోవడానికి సోవియట్ రాజ్యం అవకాశాన్ని కల్పించింది. ఇదంతా సోవియట్ దేశంలోని వివిధ జాతుల ప్రజల స్నేహఫలితం.



# అణ్వాయుధాల పాటవ పరీక్షల విరమణకు రాజ్యాల ఐక్య సంఘటనను రూపొందిద్దాము



"అసాహీ షింబుం" అన్న జపానీస్ వార్తాపత్రిక సంపాదకుడు మిస్టర్ తొమూ హిరోకాకు యిచ్చిన యింటర్వ్యూలో—యిది సోవియట్ పత్రికలలో జూన్ 30వ తేదీని ప్రచురింపబడింది—నికితా కృశ్చేవ్ అణ్వాయుధ పాటవ పరీక్షల అపుదలకు పోరాడేందుకు రాజ్యాల ఐక్య సంఘటనను ఏర్పరచాలని ప్రతిపాదించారు. ఈ ఇంటర్వ్యూలో సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి జపాన్-సోవియట్ దేశాల సంబంధాల పెంపుదల గురించి, అగ్రరాజ్యాల ప్రభుత్వాధిపతుల సమావేశానికి గల అవకాశంగురించి, థెర్మో న్యూక్లియర్ ఆయుధాల పాటవపరీక్షల విరమణను గురించి, హంగేరియన్ సంఘటనలు, ఆ దేశంలో ప్రస్తుత పరిస్థితి గురించి కూడా తన అభిప్రాయాలను తెలియజేశారు.

ఉద్రిక్తతా ఉపశమనం గురించి ఒడంబడికను చేసుకోవడానికి శాయశక్తులా కృషిని చేయడం. ప్రస్తుత పరిస్థితులలో అగ్రరాజ్యాల విధి అన్న అభిప్రాయాన్ని వ్యక్తపరిచిన హిరోకాకు బదులుచెపుతూ, యన్. యస్. కృశ్చేవ్ యిలా అన్నారు: "ప్రజలను ఆందోళన పరిచే విషయాలను పరిష్కరించేందుకు యిటువంటి సమావేశం తోడ్పడినట్టయితే మేము ఎవరినైనా, ఎక్కడైనా కలుసుకోవడానికి సిద్ధంగా వున్నాము." ఒక నిర్దిష్ట కాలంవరకూ సోవియట్ దేశం అణ్వాయుధ పాటవపరీక్షలను ఏకపక్షంగా అపుదల చేయాలని సూచించిన హిరోకా అభిప్రాయంతో కృశ్చేవ్ ఏకీభవించలేదు. "ఈ పరిస్థితిని కాస్త ఆలోచించండి" అన్నారు కృశ్చేవ్. "తాను అణ్వాయుధ పాటవ పరీక్షలను ఆపివేస్తానని సోవియట్ దేశం ప్రకటిస్తుంది కాని యిటువంటి ఆయుధాలుగల యితర దేశాలు యీ చర్యతో సహకరించక, పాటవపరీక్షలను సాగిస్తూ వుంటాయి. సహజంగా సోవియట్ దేశం వెనక పడిపోతుంది, యీ కాలంలో పై దేశాలు ముందుకు పోవడానికి ప్రయత్నిస్తాయి. దీనినీ సాధించకుండానే, కొంతకాలం తరవాత మేము మళ్లీ పాటవపరీక్షలను సాగించవలసి వుంటుంది. దీని ఫలితమేమిటి? ఈ అమితాయుధోత్పత్తి పోటీ యింకా యెక్కువయి, దిట్టపడుతుంది." "అందువల్ల సోవియట్ పక్షం చేసే ఏకపక్ష ప్రకటన సత్ఫలితాలను యివ్వకపోగా దురాక్రమణ దారులను ప్రోత్సహిస్తుంది" అని కృశ్చేవ్ నొక్కి చెప్పారు. కృశ్చేవ్, అనుసరించవలసిన యింకోమార్గాన్ని సూచించారు. "మనం, సోవియట్, జపాను దేశాలు యీ విషయమై ఒక విధమైన సంయుక్త పత్రం పైని చేవ్రాళ్లు చేదాం. తరవాత దానిని తక్కిన దేశాలు బలపర్చుతాయి. భారతదేశం యిటువంటి పత్రానికి తప్పక సమ్మతిస్తుందని నా నమ్మకం. ఇటువంటి చర్యను నిస్సందేహంగా చైనా ప్రజా రిపబ్లిక్కు, సోషలిస్టు దేశాలన్నీ బలపర్చుతాయి. పూర్వపు పరాధీన దేశాలుకూడా దానికి తమ సమ్మతిని చేస్తాయి. అణ్వాయుధ పాటవ పరీక్షల అపుదల కొరకు పోరాడే దేశాల ఒక విధమైన ఐక్య సంఘటన, యీ విధంగా ఏర్పడుతుంది. దేశాలమధ్య యీ ఉద్యమం పెరిగితే, అది మనలను మన అభీష్ట అర్థానికి తీసుకవెళ్తుంది." అని ఆయన అన్నారు.

ఈజిప్టులో యుద్ధవిరమణను గావించడంలో, సోవియట్ ప్రభుత్వం అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు, ఇజ్రెయిల్ ప్రభుత్వాలకు పంపించిన సందేశం నిర్వహించిన ముఖ్యమైన పాత్రను గురించి కూడా కృశ్చేవ్ తెలియజేశారు. ఈపాత్ర తప్పక చరిత్రలో స్థానాన్ని పొందుతుందని ఆయన ఉద్ఘాటించారు.

ఈ ఇంటర్వ్యూ సమయంలో జపాన్ - సోవియట్ దేశాల సంబంధాలూ, వాటి గతమూ, వర్తమానమూ సవివరంగా చర్చింపబడ్డాయి. ఈ రెండు దేశాల సంబంధాల చరిత్ర ఎంతో క్లిష్టమైనదని కృశ్చేవ్ తెలియజేసారు. సోవియట్-చైనీస్ ఒడంబడికలో జపాను శత్రుత్వం వహించడం సంభవనీయమని ప్రస్తావింపబడిందన్న హిరోకా ప్రకటన గురించి కృశ్చేవ్ యిలా అన్నారు: "సోవియట్ దేశానికి సంబంధించినంతవరకూ, యీ అభిప్రాయాన్ని మార్చుచేసే విషయాన్ని చర్చించడానికి అది సిద్ధంగా వుంది. కాని యిందుకు అవసరమైన పరిస్థితులు సృష్టింపబడాలి." జపాను "సుహృద్భావం చూపాలి. మొదట ప్రజా చైనాను గుర్తించాలి" అని కృశ్చేవ్ నొక్కి చెప్పారు.

ప్రజా చైనాతో వాణిజ్యం చేయడం జపానుకు లాభదాయకమని ఉద్ఘాటిస్తూ, "జపాన్లో తన ఇనుప పాదాన్ని బలంగా వేసివున్న" అమెరికాకు తాను జవాబుదారిగా వుండవలసిరావడంవల్ల, జపాను యీ విధంగా చేయడం లేదన్న అభిప్రాయాన్ని కృశ్చేవ్ వ్యక్తపరిచారు. "జపాను యీ పరిస్థితులను చాలకాలం సహించదని అనుకుంటాను" అంటూ కృశ్చేవ్ సాగించారు. "అది బూటకపు సార్వభౌమత్వంకోసం కాకుండా నిజమైన సారభౌమత్వంకోసం కృషి

చేస్తుంది. ఇది శీఘ్రంగా సంభవించగలదని మేమాశిస్తున్నాము." సోవియట్ దేశానికీ, జపానీస్ కమ్యూనిస్టుపార్టీకీ మధ్యగల సంబంధాలగురించి చెపుతూ కృశ్చేవ్ యిలా అన్నారు: "జపానీస్ కమ్యూనిస్టుల కార్యకలాపాలపైని మేము మా పలుకుబడిని వేయడంలేదు. జపానీస్ కమ్యూనిస్టుల పట్ల నా సానుభూతిని చూపుతాను, కాని మేము జపాను వ్యవహారాల్లో జోక్యం కలిగించుకోము."

జపాను, సోవియట్ దేశాలమధ్య సంబంధాలను బాగు పర్చడానికి చర్యలగురించి యింకా ప్రస్తావిస్తూ కృశ్చేవ్ యిలా అన్నారు: "సహేతుకంగా మనం పనిచేద్దాము సాంస్కృతిక సంబంధాలూ మొదలైద వాటిని పెంపొందించుకుందాము. సుస్థిర స్నేహ సంబంధాలను దిట్టపర్చుకునేందుకు అన్ని రంగాలలోనూ యింకా సన్నిహిత సంబంధాలకోసం అవసర పరిస్థితులను సృష్టించుకుందాం. మాలో శాంతి ఒడంబడికను చేసుకొండి చైనా ప్రజారిపబ్లిక్కుతో సాధారణ సంబంధాలను స్థాపించుకోండి మనమందరమూ— సోవియట్ దేశం, చైనా ప్రజారిపబ్లిక్, జపాన్ మొదలైన దేశాలు, భారత దేశం బర్మా, ఇండొనీషియాలతో బాటుగా—బహుశా ఒక సంయుక్త నిరాక్రమణ ఒడంబడికను చేసుకొనవచ్చునేమో

తరవాత ఇంటర్వ్యూలో హంగేరియన్ సమస్య ప్రస్తావనకు వచ్చింది. కృశ్చేవ్ యిలా చెప్పారు: "పూర్వపు హంగేరియన్ నాయకుల తప్పులను సామ్యవాద వ్యవస్థకు వ్యతిరేకశక్తులు ఉపయోగించుకున్నాయి. మాకూ, హంగెరీకీ అననుకూలమైన ఫలితాల నిచ్చిన పరిస్థితి, యిందువల్లనే యేర్పడింది. కాని నేడు హంగెరీలో సంపూర్ణమైన భద్రతవుంది ప్రజాతంత్ర ప్రజాస్వామ్య వ్యవస్థ సుస్థిరంగా వుంది, యిటువంటి సంఘటనలు మరి జరగవు. హంగేరియన్ ఘటనలు అందరికీ మంచి గుణపాఠం కావడంవల్ల, యితర సామ్యవాద దేశాల్లోకూడా యివి జరగవు." హంగేరియన్ ప్రభుత్వం ప్రజలు ఎంచుకున్న చట్టబద్ధమైన ప్రభుత్వం కావడంవల్ల, సోవియట్ ప్రభుత్వాన్ని సహాయం కోరడానికి దానికి హక్కుందని కృశ్చేవ్ ఉద్ఘాటించారు. హంగెరీలో యిప్పుడు సంపూర్ణమైన భద్రత వుంది. ప్రభుత్వంపట్ల ప్రజలు అసంతృప్తితో వున్నట్టయితే, దానిని గుర్తించక పోయివున్నట్టయితే యిది జరుగుతుందా? జర్మనీనుండి సేనలను ఉపసంహరించడానికీ, సైనిక స్థావరాలను రద్దుచేయడానికీ, జర్మనీ, రుమేనియా, పోలెండ్, హంగెరీలనుండి అదేసమయంలో సోవియట్ సేనలను ఉపసంహరించడానికి పశ్చిమ రాజ్యాలకు సోవియట్ దేశం చేసిన ప్రతిపాదనల గురించి కృశ్చేవ్ ఆయనకు జ్ఞాపకం చేశారు. సేనలను ఉపసంహరించి సంఘటనలు ఎలా పరిణమిస్తాయో చూద్దాం. మొదటది, ప్రజాతంత్ర ప్రజాస్వామిక ప్రభుత్వాలు చాలా సుస్థిరంగావున్నవని మనకు తెలుస్తుంది; రెండోది, ఏ ప్రభుత్వంపట్ల ప్రజలు ఎక్కువగా యిష్టాన్ని చూపుతారో చర్యల్లో మనం సరిచూసుకుందాం. జపాను ప్రజలు డిమాండుచేస్తున్నారు కాబట్టి, అమెరికన్లు జపానునుండికూడా తమ సేనలను ఉపసంహరించుకోవాలని కృశ్చేవ్ అన్నారు.



ల్యుబొవ్ యరొవయా పాత్రధారిణి వీరా పషెన్నయా.

# మరపురాని నాటకాలు

## ఎన్. లోర్ధికి పనిడ్జే

ఒక అందమైన యువతి ముఖం, కాలగమనంలో కాస్త దెబ్బతిన్న ఛాయా చిత్రంనుండి మనవేపు చూస్తోంది. అది సంతోషంగా వున్న ముఖం కాదు. ఆ పెద్ద కళ్లు దీర్ఘాలోచనను సూచిస్తున్నాయి. ఆమె ఎవరు? ఆ ఛాయాచిత్రం దిగువనున్న వ్రాతలో "ల్యుబోవ్ యరొవయా పాత్రలో నటి వీరా పషెన్నయా" అని వుంది. ఈమె ప్రసిద్ధురాలైన ల్యుబోవ్ యరొవయా అన్న మాట!.... మే మీమెను ముప్పయ్యేళ్ళక్రితం చూశాము, ప్రఖ్యాతమైన అకడిమిక్ మలే నాటకశాలలో కాన్‌స్తంతిన్ త్రెనొయ్యెవ్ నాటకం "ల్యుబోవ్ యరొవయా" ప్రథమ ప్రదర్శనం జరిగినప్పుడు.

ఈ నాటకం గొప్ప విజయాన్ని పొందింది. విప్లవకారుడైన తన భర్తను యెంతో ప్రేమించే యువ ఉపాధ్యాయిని ల్యుబోవ్ యరొవయా జీవితాన్ని యిది వాస్తవికంగా, ఉత్తేజకరంగా ప్రదర్శిం

చింది. మొదట్లో ఆమెకు ఆయన భావాలపట్ల సానుభూతి మాత్రమే వుండేది. కాని ప్రథమ ప్రపంచ యుద్ధకాలంలో ఆమె భర్త యుద్ధరంగానికి వెళ్ళాక, ఆయన హతుడయ్యాడని ఆమె భావించినప్పుడు విప్లవోద్యమంలో అతని స్థానాన్ని ఆమె స్వీకరించింది. తన భర్తపట్ల ప్రేమవల్లనే ఆమె యీపని చేసిందన్నది నిజమే. కాని తరవాత నామె ప్రజల విముక్తికోరకు, వారి సౌఖ్యంకొరకు జరిగే పోరాటంలో పూర్తిగా లీనమైపోయింది. తరవాత విషాద సమయం వచ్చింది. ఆమె కిది అగ్ని పరీక్ష. ఆమె భర్త విప్లవ విద్రోహి అయ్యాడు. ఈ భయంకరమైన దెబ్బకు లొంగిపోకుండా తనలో శక్తిని కనుగొన్నది, ల్యుబోవ్ యరోవయా. తన ఉన్నతాదర్శానికి ఆమె విధేయంగా వుండిపోయింది. తన భర్త చేరిన శత్రువుల ముఠాను ఆమె సవాలు చేసింది కూడా.



మాస్కోలోని గోర్కీ కళా ప్రదర్శనాలయంలో "క్రెమ్లిన్ గంటలు" అన్న ఎన్. పగోదిన్ నాటకంలోని ఒక దృశ్యం

మాటఅకంటె బలంగా వుంటాయి కొన్ని అంశాలు. "ల్యుబోవ్ యరోవయా" సోవియట్ నాటకశాలల్లో ముప్పయ్యేళ్ళు పాటుగా ప్రదర్శింపబడుతోంది. సుమారు 200 వృత్తి సమాజాలు (ఔత్సాహిక కళా బృందాలను లెక్కించకుండా) యీ నాటకాన్ని ప్రదర్శించాయి. సద్గ్రంథంలాగా, కమ్మని పాటలాగా యావజ్జీవితానికీ యిది అభిమాన గ్రంథమై పోయింది.

సోవియట్ నాటక ప్రదర్శనలలో యిటువంటి నాటకాలు చాలా వున్నాయి.

ప్రజలను నాయకపాత్రలో, సోవియట్ నాటకాలలో ప్రముఖంగా తీసుకరావడానికి ప్రయత్నించిన వారిలో వెసెవోలోద్ విష్నెవ్‌స్కీ ఒకరు. ఆయన నాటకాలలో ప్రజలు వ్యక్తిత్వంలేని మూకగా కాకుండా, అభిమానాలూ, వాంఛలూ, ఆశలూ గల నవప్రజా సమూహంగా కనిపించారు. అప్పుడాయన ఒక యువ నాటకకర్త, వారివలెనే సామాన్యుడు. ఇప్పుడాయన సోవియట్ దేశంలో సుప్రసిద్ధుడు. కాని ఆయన తొలి నాటకాలు ప్రచురింపబడిన కాలంలో మార్షల్ బుడెన్నీ యొక్క విఖ్యాత ప్రథమ అశ్విక సేనలోని మెషీన్-గన్నర్‌ను కొద్దిమంది మాత్రమే ఎరుగుదురు. తానే చూసి అనుభవించిన వాటిని గురించి విష్నెవ్‌స్కీ వ్రాసేరు. నూతన సోవియట్ రిపబ్లిక్ తన మనుగడ కోసం పోరాడిన భయంకరయుద్ధాలను ఆయన వివరించారు. ఆ పోరాటాల్లో ధైర్యంగా నిలచిన కార్మిక కర్షకుల పరాక్రమంగురించి ఆయన చెప్పారు. ప్రజలను సమీకరించి వారికి నాయకత్వం వహించడానికి తన కొక్కదానికే శక్తివున్నదని నిరూపించుకున్న కమ్యూనిస్టుపార్టీ శక్తి గురించీ ఆయన చెప్పారు.

విష్నెవ్‌స్కీ తన నాటకాలలో ఒకదానికి "ఆశాభరిత విషాదం" అని పేరు పెట్టారు. ఇది ఆయన ఉత్తమోత్తమ రచన. దీనిలోని విషాదకథ దాని ముఖ్యపాత్ర మరణం—యీమె అద్భుతమైన కమిసార్—విప్లవ శత్రువులతో భయంకర పోరాటాలలో ఆమె నడిపిన నావికుల రెజిమెంటులో చాలా మంది మరణమూ. అయినప్పటికీ వారు ప్రాణార్పణ చేసిన ఆదర్శం విజయాన్ని పొందింది. యీ విజయం యావత్తు నాటకంలోనూ వుంటుంది. అందువల్లనే విష్నెవ్‌స్కీ తన విషాదాంత నాటకాన్ని ఆశాభరితమైనదని అనగలిగారు. మొట్టమొదట ప్రదర్శించిన మాస్కో కమెర్నీ నాటక సమాజం దాని గొప్పదనాన్ని గ్రహించి చెప్పడంలో కృతకృత్యమయింది.

ఈ నాటకం సోవియట్ దేశంలోని మారుమూలల్లో సైతం ఎన్నిసార్లు ప్రదర్శింపబడిందో, యీ నాడు లెక్కించడం కష్టం. కనీసం నూట ఏభై నాటకశాలల్లో యిది ప్రదర్శింపబడింది, యింకా ప్రదర్శింపబడుతోంది.

"ఆశాభరిత విషాదం"తోనూ, "ల్యుబోవ్ యరోవయా"తోనూ సమానంగా ప్రజాదరణను పొందిన యింకోనాటకం, "క్రెమ్లిన్ గంటలు". ఇదికూడా సోవియట్ నాటక ప్రేక్షకులకు చాలా అభిమానపాత్రమైనది. దీనిని రచించినది నికొలాయ్ పొగొదిన్. దీనిలోని ముఖ్యపాత్రలు వ్లాదిమిర్ ఇల్యిచ్ లెనిన్, లేదా ఉత్త ఇల్యిచ్, సోవియట్ ప్రజలు ఆయనను మమకారంతో పిలిచినట్టుగా.

ప్రఖ్యాత గ్రంథకర్త అయిన నికొలాయ్ పొగొదిన్ "క్రెమ్లిన్ గంటలు"ను, సోవియట్ దేశ 20 వ వార్షికోత్సవ సందర్భాన వ్రాశారు. తమ ప్రియతముడైన ఆచార్యునీ, మిత్రునీ, నిగర్వి, నిజాయితీపరుడూ అయిన వానినీ—వాస్తవంగా లెనిన్‌కుగల గుణగణాలను ప్రజలు గ్రహించేటట్టుగా ఆయన పాత్రను చిత్రించవలసి వచ్చింది. "క్రెమ్లిన్ గంటలు" రచనకు ముందర, సోవియట్ నాటకశాలల్లో ప్రచురింపబడిన అద్భుతమైన నాటకాలను చాలా

వి. ఐ. లెనిన్ పాత్రలో వున్న బోరిస్ స్మిర్నోవ్





లెనిన్‌గ్రాడ్‌లోని పుష్కిన్ అకడమిక్ నాటక మందిరంలో ప్రదర్శించబడిన "ఆశాభరిత విషాదం" అన్న వి. విషెన్‌స్కీ నాటకంలోని ఒక దృశ్యం

వాటిని పొగొదిన్ వ్రాశారు. తన కృషిలో ఆయన గొప్ప విజయాన్ని పొందారని మనం ఒప్పుకోక తప్పదు. లెనిన్ పాత్రను ధరించిన వ్యక్తి రంగస్థలంమీద కనిపించిన క్షణంనుండీ, మనం నాటకాన్ని పరవశులమై చూస్తాము. కొంతమంది రైతుల పిల్లలతో మనకు లెనిన్ కనిపిస్తారు. తమ చిన్నయింటికి వచ్చిన నిగర్వియైన వేటకాడు లెనినే అని వారు గుర్తించలేరు. తమ సందేహం తీరాక వారందరూ—లెనిన్, పిల్లలూ—ఎంతగా నవ్వుకుంటారు!

ఇంకో ఘట్టంలో ఒక యువ నావికుడైన రైబకోవ్‌తో మాటాడుతూ వుండడం కవిపిస్తుంది. రైబకోవ్ ప్రేమలో పడ్డాడు. లెనిన్ అతనిని గంభీరంగా ప్రశ్నిస్తారు. యీ అమూల్య భావాన్ని పెంపొందించుకొమ్మని అతనికి సలహాయిస్తారు. తనకు మిత్రులుగా, సహాయకులుగా, లేదా నిజాయితీ పరులైన మామూలు ప్రజలుగా తాను పరిగణించేవారందరితోనూ—వారు పెడదారిలో వున్నప్పుడుకూడా—లెనిన్ నిరాడంబరంగా, కలిసి మెలసి వుంటారు, ఆకర్షణీయంగావుంటారు. ఉదాహరణకు, మొదట్లో అపారమైన విప్లవ సృజనాత్మక శక్తులలో నమ్మకంలేని, సోవియట్ రాజ్యానికి వ్యతిరేకియైన ఒక వృద్ధ ఇంజనీయ జబెలిన్‌కు నిర్మాణాత్మక కృషికి గొప్ప అవకాశాలుంటాయని వెల్లడిస్తారు; ఆయన సోవియట్ రాజ్యాన్ని మనసారా బలపర్చే వ్యక్తిగా మారిపోతారు.

లెనిన్‌నూ, సోవియట్ రాజ్యాన్నీ ఎదుర్కొన్న కష్టాలను కూడా గ్రంధకర్త చూపుతారు. పొగదిన్ నాటకం అక్షరాలా నిజమైనది, గంభీరమైనది. ఈ నాటకంలోని నిజాయితీ, కళా ఔన్నత్యమూ ఎటువంటివంటే అవి హృదయాన్ని వశపర్చుకుంటాయి; లెనిన్ ఉదాత్త భావాలను లభ్యం చేసుకోవడానికి పోరాటంలో, కమ్యూనిజం నిర్మాణానికి కృషిలో సోవియట్ ప్రజలకు సహాయపడతాయి.

ఈ అమరనాటకాలు, విప్లవ చారిత్రిక సంఘటనలను శాశ్వతంగా నిలిపాయి. ఇవి దాని ఉన్నతాదర్శాలనూ, విప్లవంలో పాల్గొన్న సామాన్యుల గొప్ప ఆత్మత్యాగాన్నీ, పరాక్రమాన్నీ వెల్లడిస్తాయి. ఈ కారణాల వల్లనే యీ నాటకాలు సోవియట్ నాటక కళా స్వర్ణ విధిలో ఒకభాగమైపోయాయి. ఇవి మన మిత్రులయ్యాయి, మనకు యావజ్జీవిత సహచరులయ్యాయి.

"ఆశాభరిత విషాదం"లోని మరో దృశ్యం



# "30 సంవత్సరాల క్రితం" ఎల్. క్లైత్స్కి

☆

## (1921-25 నాటి భారత-సోవియట్ సాంస్కృతిక సంబంధాల చరిత్రకు సంబంధించిన ఘట్టం)

సోవియట్ దేశ చరిత్రలో పందొమ్మిది వందల యిరవై ప్రారంభ కాలం, చాలా గడ్డుకాలం. అంతర్యుద్ధమూ, విదేశీ ప్రవేశ జోక్యమూ అప్పుడప్పుడే ముగిశాయి, ప్రజలు యుద్ధంలో నాశనమైన తమ పరిశ్రమలనూ, వ్యవసాయాన్నీ పునరుద్ధరించుకోవడానికి పూనుకున్నారు.



భారతీయ పదార్థ విజ్ఞాన శాస్త్రవేత్త సి. వి. రామన్

ఇంత కష్టకాలమైన యీ సంవత్సరాలలోనే ప్రాచ్యదేశాల పట్ల, ముఖ్యంగా భారత దేశం పట్ల సోవియట్ ప్రజల ఆసక్తి ఉదయించి, పెంపొందింది అనేక సాంస్కృతిక సంబంధాలు ఏర్పడ్డాయి. అవి యీనాడు బ్రహ్మాండంగా అభివృద్ధిచెందాయి. 1920లో, జోక్యందారుల సేనలు పెత్రోగాడ్‌ను సమీపిస్తున్నప్పుడు, ప్రజలకు రొట్టె లేనప్పుడు, ఫాక్టరీలకు పనిలేకుండా వున్నప్పుడు, రైల్వేలు కూడా పనిచేయకుండా వున్నప్పుడు, అటువంటి కాలంలో, సోవియట్ దేశ స్థాపకుడైన వ్లాదిమిర్ లెనిన్ సూచనపైన, చైనీస్, ఉర్దూ, హిందీ, బెంగాలీ భాషలు బోధింపబడే అధునాతన ప్రాచ్య భాషా విద్యాలయం నెలకొల్పబడింది.

విజ్ఞానశాస్త్ర పరిషత్తు ఎక్కువగా కార్యకలాపాలు సాగించింది. అప్పుడు ఓల్డెన్‌బర్గ్, ష్చెర్బత్‌స్కోయ్, రోసెన్‌బర్గ్‌వంటి ప్రముఖ పండితులూ, భారత దేశానికి సంబంధించిన విషయాలలో ప్రవీణులూ పరిషత్తులో సభ్యులుగా వుండేవారు. "బౌద్ధ మతగ్రంథ పాఠాల సంపుటం" అన్న అనేక సంపుటాలలో ఒక గ్రంథమూ, ఒక సంస్కృత భాషా పాఠ్యగ్రంథమూ, "బౌద్ధమత తత్వశాస్త్ర ఉత్కృష్ట రచనలు" అన్న ఒక గ్రంథమూ పరిషత్తు ప్రచురించింది, వేద గీతాలను రష్యన్‌లోనికి అనువదించింది.

1925 సెప్టెంబరులో జరిగిన విజ్ఞానశాస్త్ర పరిషత్తు 200 వార్షికోత్సవం ముఖ్యంగా భారత-సోవియట్ సంబంధాలను దృఢపరచడానికి చాలా తోడ్పడింది. ఈ ఉత్సవానికి 25 దేశాలనుండి పండితుల ప్రతినిధివర్గాలు వచ్చాయి. వారిలో భారతీయ విజ్ఞానశాస్త్ర ప్రపంచ ప్రతినిధులు కూడా వున్నారు. భారతీయ ప్రతినిధివర్గంలో ప్రఖ్యాత పదార్థ విజ్ఞానశాస్త్రవేత్త, తదుపరి నోబెల్ బహుమతిని పొందిన ప్రసిద్ధుడూ అయిన ప్రొఫెసర్ రామన్, బొంబాయి విశ్వవిద్యాలయానికి చెందిన ప్రొఫెసర్ హెచ్. మోడీ, రచయిత, పండితుడూ, ఇరానియన్ సంస్కృతి విషయంలో ప్రముఖ ప్రవీణుడూ అయిన బ్రగంగా కూడా వున్నారు.

తొంభై సంవత్సరాల వృద్ధుడు ప్రొఫెసర్ మోడీ చేసిన ఉపన్యాసం సోవియట్ విజ్ఞానశాస్త్రవేత్తలకు చిరస్మరణీయమైనది. ఈ భారతీయ వృద్ధ విజ్ఞానశాస్త్రవేత్త చెప్పిన విషయాలలో ఒకటి. "ప్రాచ్య ప్రజల గురించి అధ్యయనం చేయడంలో ఎంతో కాలాన్ని వెచ్చించిన రష్యన్ పండితులకు నా హృదయ పూర్వకమైన కృతజ్ఞతను తెలియజేస్తున్నాను. వారి మహత్తర దేశ కృషి ఫలించునుగాక, ప్రసిద్ధిని చెందునుగాక!"

అప్పటికి యింకా యువకుడే అయినా ప్రఖ్యాత పదార్థ విజ్ఞాన

(మిగత 31వ పేజీలో)

సోవియట్ దేశ విజ్ఞాన శాస్త్ర పరిషత్తు ద్వితీయ శతవార్షికోత్సవ సందర్భంగా లెనిన్‌గ్రాడ్‌లో జరిగిన ఒక విందు



# పాఠకుల ప్రశ్నలకు మా జవాబులు

## ప్రశ్న: సోవియట్ విద్యార్థులు ప్రతి ఏడాదీ ఎలా ప్యాసవుతారు? వారు వార్షిక పరీక్షల్లో ప్యాసవ్వాలా?

*శ్రీ ఆర్. శౌరి, శ్రీ రాజన్. పుదుక్కోటై.*

జవాబు: మాస్కో ప్రభుత్వ విశ్వవిద్యాలయ విద్యార్థిని లియా ఎవ్సెయేవా.

సోవియట్ ఉన్నత పాఠశాలలలో ప్రతి విద్యాలయ సంవత్సరమూ రెండుగా విభాగింపబడి వుంటుంది, ఒకొక్క విభాగపు చివరను విద్యార్థులు తమ పరీక్షలలో ప్యాసవవలసి వుంటుంది. శీతాకాలపు పరీక్షలు సాధారణంగా డిసెంబరు చివర్లో మొదలై, జనవరి అంతటా జరుగుతాయి. వేసవి పరీక్షలు మే—జూన్ నెలల్లో జరుగుతాయి.

వేసవి సెలవుల్లో విద్యార్థుల జ్ఞానం సంతృప్తికరంగా వున్నట్టయితే, ఆ విద్యార్థి మరుచటి సంవత్సరపు చదువుకు ఉత్తీర్ణుడవుతాడు. తన వేసవి సెలవుల్లో విద్యార్థికి రెండింటికంటె ఎక్కువగా అసంతృప్తికరమైన గుణాలు వచ్చినట్టయితే, అతనిని యింకో సంవత్సరం చదవమనైనా చెప్తారు, లేదా విద్యాలయంనుండి బయటికి పంపివేయబడుతాడు.

## ప్రశ్న: రష్యాలో రెడ్‌క్రాస్ సొసైటీ స్థానం ఏమిటి?

జవాబు: రెడ్‌క్రాస్, రెడ్ క్రెసెంట్ సొసైటీల కార్యనిర్వాహక సంఘపు విదేశ విభాగపు అధిపతి వి. యన్. స్పసొకుకొత్‌స్కీ

సోవియట్ దేశంలోని రెడ్‌క్రాస్, రెడ్ క్రిసెంట్ సొసైటీల యూనియన్, ఒక పెద్ద ప్రజాసంస్థ. దానిలో 21,500,000 మంది సభ్యులున్నారు, అంటే దేశ జనాభాలో ఒకటింట పదోవంతన్నమాట.

ఈ యూనియన్లో 15 రిపబ్లికన్ సొసైటీలున్నాయి : 11 రెడ్ క్రాస్ సొసైటీలు, 4 రెడ్ క్రిసెంట్ సొసైటీలూ. ఎర్ర నెలవంక (రెడ్ క్రిసెంట్) చిహ్నం, ముస్లిం మతం ప్రధానంగా వున్న తుర్క్‌మన్, ఉజ్బెక్, తజిక్, అజర్‌బైజాన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కులలో ఆమోదింపబడింది. రెడ్‌క్రాస్, రెడ్‌క్రిసెంట్ సంఘాల నిధులు ప్రవేశరుసుము, సభ్యత్వ రుసుముద్వారా, వేరు వేరు సంఘాలూ, వ్యక్తులూ బహుమానంగా యిచ్చిన నిధులూ, ఆస్తులు ద్వారా సేకరింపబడతాయి.

ఈ యూనియన్ కార్యకలాపాలన్నీ ప్రజాస్వామ్య సూత్రాన్ననుసరించీ, ప్రధానశాఖ లన్నిటి ఎన్నికద్వారా, వాటి సమిష్టికృషి ద్వారా, సభ్యులకు నివేదికలను సమర్పించడం ద్వారా సాగుతాయి.

సోవియట్ దేశ మహాసభ, యీ యూనియన్ యొక్క అత్యున్నత సంస్థ. రహస్య ఓటింగు పద్ధతిద్వారానది వైద్య ప్రతినిధులు, విద్యారంగంలో పనిచేసేవారూ, సాంఘిక సంక్షేమ రంగములో పనిచేసేవారూ, వైద్యశాస్త్ర ప్రముఖులూగల కార్యనిర్వాహక సంఘాన్ని ఎన్నుకుంటుంది. కార్యనిర్వాహక సంఘ సమావేశాలకు మధ్య కాలాల్లో, యూనియన్ కార్యకలాపాలను కార్యనిర్వాహక సంఘ అధ్యక్షవర్గం నడుపుతుంది.

సోవియట్ రెడ్‌క్రాస్ సొసైటీ అతిముఖ్య కర్తవ్యాలలో ఒకటి ప్రజా బాహుళ్యానికి యీ రంగంలో పనిచేసే వారికి పారిశుద్ధ్య శిక్షణ (శానిటరీ ట్రెయినింగ్) నివ్వడం. ఈ సంఘసభ్యులు పారిశుద్ధ్య జ్ఞానాన్ని రెడ్ క్రాస్, రెడ్ క్రిసెంట్ సంఘాల స్థానికశాఖలు ఏర్పరిచిన కేంద్రాలలో సంపాదిస్తారు. వారు ప్రత్యేకమైన పారిశుద్ధ్య స్థావరాలను నివాస గృహాలలోనూ, పాఠశాలలలోనూ, పరిశ్రమలలోనూ, సంస్థలలోనూ ఏర్పాటు చేస్తారు. ఈ స్థావరాల్లో ప్రథమ చికిత్సా సాధనాలూ, స్ట్రెచర్లు వుంటాయి, యివి వైద్యరంగంలో పనిచేసేవారి సాయకత్వాన నడుస్తాయి.

సోవియట్ రెడ్‌క్రాస్ సైనిక చర్యలలోనూ, ప్రకృతి అరిష్టాలలోనూ నష్టపడిన వారికి ఎంతో తోడ్పడతాయి; అశక్తులకు మంచి జీవిత పరిస్థితులను కల్పించడానికీ, వారు చేయగల పనులు వారికి యిప్పించడానికీ ప్రభుత్వ శాఖలకు యివి తోడ్పడుతాయి; యుద్ధంలో హతులైనవారి కుటుంబాలకు వారి పిల్లలను పోషించడం ద్వారా, వారి ఆరోగ్యంపట్ల శ్రద్ధ తీసుకోవడం ద్వారా సహాయం చేస్తాయి.

సోవియట్ రెడ్‌క్రాస్ అనేకసార్లు చాలా దేశాల (అల్జీరియా, ఇటలీ, అమెరికా, భారతదేశం, ఇండోనీషియా మొదలైనవి) ప్రజలకు సహాయం చేసింది. వారు ప్రకృతి అరిష్టాలవల్ల నష్టపడినప్పుడు. 1956 నవంబరులో సోవియట్ రెడ్‌క్రాస్ సోవియట్ దేశపు శ్రామిక ప్రజలిచ్చిన విరాళాలతో పదిహేను మిలియన్ల విలువగల ఆహార పదార్థాలనూ, మందులనూ, ఆసుపత్రి సామగ్రినీ, అంబ్యులెన్సులనూ కొని, ఆంగ్లో–ఫ్రెంచి–ఇజ్రాయల్ దురాక్రమణకు గురి అయిన ఈజిప్టు ప్రజలకు పంపింది.

మిత్ర భారత ప్రజలకు స్వార్థరహితంగా సహాయపడడానికి కృషి చేస్తూ రెడ్ క్రిసెంట్ సొసైటీల యూనియన్ కార్యనిర్వాహక సంఘం, ఢిల్లీలోని లేడీ హార్డింజ్ మెడికల్ కాలేజీలో బాలల ఆరోగ్య రక్షణ కొరకు ఒక పరిశోధన శాఖనూ, శరీరచికిత్సా పద్ధతుల కొరకు ఒక పరిశోధన, చికిత్సా కేంద్రాన్నీ నెలకొల్పడానికి సహాయం చేసింది, యీ సంస్థలకు మంచి ప్రవీణులను పంపింది.

సోవియట్ రెడ్ క్రాస్ కార్యకలాపాలు మానవతా భరితమైనవి. మానవారోగ్యం పట్ల శ్రద్ధ, ప్రజల శాంతి భద్రతలకు రక్షణకొరకు, పరిపోషణ కొరకు అంతర్జాతీయ స్నేహ సంబంధాల విస్తరణ ద్వారా యిది వ్యక్తమవుతోంది.

# వరి పంట, సోవియట్ నిపుణుల కృషి

ఇ. వెలిఖ్కొ డి.యస్ సి.
(వ్యవసాయం)

సోవియట్ దేశంలో వరిపంటకు సంబంధించిన వైజ్ఞానిక కృషి ప్రత్యేక ప్రయోగ వరిపంట కేంద్రాలలోనూ, వ్యవసాయ శాస్త్రజ్ఞులకు శిక్షణనిచ్చే విద్యాశాలల్లోనూ, యింకొన్ని వైజ్ఞానిక సంస్థల్లోనూ జరుగుతుంది.

ప్రత్యేకంగా వరిపంట విషయంలో కృషి చేసే పెద్ద ప్రయోగకేంద్రాలు క్యూబన్, దూర ప్రాచ్య, ఉజ్బెక్ కేంద్రాలు. వాటిక్రింద, ఒకొక్కదానికీ 200 నుండి 300 వరకూ హెక్టార్లభూమి (ఒక హెక్టారు సుమారు 2.5 ఎకరాలు), అవసరమైన సామగ్రి అంతా, విజ్ఞాన శాస్త్రజ్ఞుల సిబ్బందీ వున్నాయి. తమ మండలాలలోని మట్టిపరిస్థితి, శీతోష్ణస్థితి ననుసరించి, వరిపంట సాగుకు సంబంధించిన నిర్దిష్ట సమస్యలను గురించి యీ ప్రయోగ కేంద్రాలు కృషి చేస్తాయి, అవి విత్తనాలను వేయడానికి మంచి కాలాన్నీ, నేలను సాగుజేసే రోజులనూ, పద్ధతులనూ, ఎరువులు వెయ్యవలసిన మోతాదునూ, అవి వెయ్యవలసిన సమయాన్నీ ఎంచుకుంటాయి. ఈ ప్రయోగాలను సాధారణంగా లెనిన్ వ్యవసాయశాస్త్ర పరిషత్తు తనిఖీ చేస్తుంది.

రష్యాలో చాలాకాలంగా వరిపంట గురించి మిడిమిడి జ్ఞానమూ, అప్పుడప్పుడు తప్పుడు భావాలుకూడా వుంటూ వుండేవి. మధ్యాసియాలోనూ, ట్రాన్స్ కకాసస్‌లోనూ మాత్రమే పెరిగే ఉష్ణమండలపు మొక్కగా యిది పరిగణింపబడేది. ఆ కాలంలో వరిపంట కేంద్రీకరింపబడి వున్న రెండు జిల్లాలూ యివి.

సోవియట్ ప్రభుత్వం మధ్యాసియా రిపబ్లిక్కులో పత్తి పంటను చాలా యెక్కువగా వ్యాప్తి చేయడానికి ఉద్దేశించింది. కాని నీటి కొరత యీ సమస్యను పరిష్కరించకుండా నిరోధించింది. మధ్యాసియాలో కొద్దిగా వున్న నీటి సరఫరాను, వరిసాగుకు ఉపయోగపరచడం అహేతుక మనిపించింది (ఉజ్బెక్ రిపబ్లి



క్రాస్నోదార్ మండలంలోని పొలాలలో పంటకోతలు కోస్తున్న స్వయంచోదక సమిష్టి కంబైన్



క్యూబన్‌లోని వరి నీటి వసరు ప్రధాన విభాగపు దృశ్యం

క్యూబాన్‌లోని వరి నీటి వసరు, పంపిణీ విభాగం



క్కులో ఒక హెక్టారు వరిపంటకు, ఒక హెక్టారు పత్తి తోటానికి కావలసిన దానికంటె 10, 15 రెట్లు ఎక్కువగా నీరుకావాలి). మధ్యాసియాలోనూ, ట్రాన్స్–కకాసస్‌లోనూ పత్తిపంట భూమి వైశాల్యాన్ని పరిమితం చేయడానికి యిదే కారణం. ఉత్తరాదికి, చాలినంత నీటి సరఫరాగల జిల్లాలకు తీసుకపోయే దృష్టితో, అదే సమయంలో కృషి మొదలైంది.

ఈ పద్ధతి పరిశోధనను ప్రారంభించి ఎక్కువగా పాల్గొన్నవారు ప్రొఫెసర్లు డి. షెయిక్-అలీ, వి. రిడిగెర్, ఇందుకు కృషి ఇంకా సాగుతోంది, వరి సాగు క్రమక్రమంగా వ్యాప్తమవుతోంది.

ఉత్తర కకాసస్‌లో వరి సాగుకు సంబంధించిన పరిశోధన చాలాతీవ్రంగా సాగుతోంది. ఇక్కడి కృషిని ప్రొఫెసర్ పి. విత్తె స్వయంగా చేశారు. ఇప్పుడు దానిని వి. షుమకోవ్ సాగిస్తున్నారు. వి. షుమకోవ్ గొప్ప ఉత్సాహంతోనూ, ఎంతో శక్తితోనూ పనిచేస్తారు. ఉత్తర కకాసస్‌లో యీయన విజ్ఞానశాస్త్ర వేత్తగా మాత్రమే కాకుండా, క్యూబన్లో 1931-32 లో తొలి వరిపంట నీటి వనరుల కాలువల నిర్మాణాన్ని నడిపిన పెద్ద యింజినీరుగాకూడా పేరు పడ్డారు.

ఈ కృషి ఫలితంగా వరిపంట క్రాస్నొదార్, స్తవ్రొపోల్ మండలాలలోనూ, రోస్తోవ్ ప్రాంతంలోనూ, ఉక్రెయిన్లోనూ సామాన్యమైన పంట అయ్యింది. సోవియట్ దేశంలో వరిపంట క్రమక్రమంగా ఉత్తరాదికి విస్తరిస్తోంది. వరి పంటను ఉష్ణమండలపు పంటగానూ, సమశీతోష్ణ మండలపు పంటగానూ భావించడం పోయింది.

వృక్షప్రజనన కారుల సహాయం లేకుండా, యీ రంగంలో పెద్ద అభివృద్ధి వచ్చి ఉండేది కాదు. పెరిగేకాలం 105 నుండి 115 రోజులకు మించని వరిరకాలు మాత్రమే, కొత్త వరిపంట ప్రాంతాలలో పక్వానికి వస్తాయి. తొందరగా పక్వానికి వచ్చేటటువంటి జపాను, కొరియా దేశాలకు చెందిన రకాల ఆర్థిక గుణాలు, వరిపంటను పండించే సోవియట్ సేద్యకారులను సంతృప్తి పరచలేదు. దేశీ రకాలను తయారు చేసుకోవలసివచ్చింది.

వరిపంటకు సంబంధించిన ఎంపికపనికి పునాదులు వేసినవారు ప్రొఫెసర్ జి. గుష్చిన్. అంటుకట్టడం ద్వారానూ, విడివిడిగా ఎంపికం చేయడం ద్వారానూ ఆయన అనేక కొత్త పద్ధతులను పెంపొందించారు. అవి, తదుపరి వరిపంటల రకాలలో కొత్తవాటినీ, తొందర్లో పక్వానికి వచ్చేవాటినీ, ఎక్కువగా కాపు కాసే వాటినీ తయారు చేశాయి. ఇంకో సమర్థుడైన వృక్ష ప్రజనన కారుడు టి. మటోవ్. ఆయనకు చెందిన "మటోవ్‌స్కీ-216" అన్న రకం, క్యూబన్, డాన్ ప్రాంతాల్లో వరిసాగు చేసే వారిలో యింకా గొప్పగా ఆదరణను పొందుతూనే వుంది.

విపులంగా వృక్ష ప్రజనన కృషి సాగుతూ వుండడంవల్ల సోవియట్ దేశానికిప్పుడు దేశములో ఎంపిక చేయబడి, వరిపంటను సాగుచేసే వివిధ జిల్లాలలో ప్రవేశపెట్టబడిన వివిధ రకాల బియ్యంవున్నాయి. వాటికి అద్భుతమైన ఆర్థిక గుణాలున్నాయి, విభిన్నమైన పెరిగే కాలపు పరిమితి వుంది. సోవియట్ దేశానికి 85 రోజుల్లో పక్వానికి వచ్చేవి, ఎకరానికి 2.2 టన్నులు పండేవి ("అలకుర్‌స్కీ") వరి పంట రకాలున్నాయి. 115 రోజులు పట్టే పండేకాలంగల, ఎకరానికి 2.4 టన్నులు పండేవి ("క్రోస్-124") సగటున పక్వానికి వచ్చేవి రకాలున్నాయి. ఆలస్యంగా పక్వానికి వచ్చేరకాలు కూడా వున్నాయి. ఇవి ఎకరానికి 3.2 టన్నులు పండుతాయి, పక్వానికి రావడానికి 130 నుండి 135 రోజులు పట్టినప్పటికీ (క్రాస్నొదర్‌స్కీ-3352). స్థానికంగా తయారు చేయబడి, సోవియట్ దేశంలో చాలా కాలంగా సాగుచేయబడి, పెద్ద గుంపుగా ఎంపిక చేయబడటం ద్వారా అభివృద్ధి చేయబడిన కొన్ని పాత రకాలుకూడా బాగా విలువగలవి. వరి పండింపబడే సోవియట్ దేశపు జిల్లాలన్నిటిలోనూ, మొక్కల ప్రజననం సాగుతూనే వుంది. పంటను యంత్రాల ద్వారా కోయడానికి వీలుగా దిగకుండా వుండే పెద్ద పంటలను యిచ్చే రకాలు, పొదుపుదృష్ట్యా ఉత్తమమైన వాటిగా పరిగణింపబడుతున్నాయి.

వరిపంట సాగులో నీటిని పొదుపుచేసే పద్ధతులు, శాస్త్ర పరిశోధనకు పెద్ద హంశంగా వున్నాయి. ఈ పరిశోధన అనేక విధాలుగా సాగుతోంది. ఒకటి, వరిపొలం నీటిక్రిందను వుండే కాలాన్ని తగ్గించకుండా నీటి ఖర్చుకు సహేతుకమైన పరిమితులను ఏర్పర్చడానికి కృషిచేసేది. వరి, గడ్డి పంటలను మార్పిడి చేసివేసే ఒక సరైన పద్ధతి, యీ విషయంలో చాలా ఫలప్రదమైనది. నీరు పెట్టే కాలాన్ని తగ్గించడానికి గల అవకాశాలు కూడా ఆలోచింపబడ్డాయి, సోవియట్ విజ్ఞానశాస్త్రజ్ఞులు చేసిన కృషి ఫలితంగా సోవియట్ వరిపంట రకాలకు వేటికికూడా, విత్తులు జల్లే కాలం నుండి మొక్క దట్టంగా ఏర్పడడం మొదలు పెట్టేవరకూ, పక్వానికి రావడం మొదలు పెట్టినప్పట్నుండి కోతల కాలం వరకూ నీటి క్రింద వుండవలసిన అవసరం లేదని నిరూపింపబడింది. కాని యిరిగేషన్ నీటిని పొదుపు చేయడానికి ఉత్తమమైన మార్గం, వరిపొలాలను నీటిక్రింద పెట్టకుండా అప్పుడప్పుడు నీరు కట్టేపద్ధతి. ఈ విషయంలో చాలా ప్రయోగ కేంద్రాలు గొప్ప అభివృద్ధిని సాధించాయి. కాని ఈ సమస్య ప్రొఫెసర్ పి. వెత్తె అనావృష్టిని ప్రతిఘటించే రకాలైన "జొలొతి యొవ్యఖొడి", "ఓల్గా-డాన్‌స్కోయ్" మొదలైన రగాలను పెంపొందించాక మాత్రమే పూర్తిగా పరిష్కరించగలిగారు. ఈ రకాలన్నిటికీ పెరిగే కాలంలో 8 లేదా 10 సార్లు మాత్రమే నీరు కట్టడం అవసరం. ఇందుకు ఖర్చుచేసే మొత్తం నీరు, హెక్టారుకు 5000 క్యూబిక్ మీటర్ల నీటికి మించదు.

అప్పుడప్పుడు నీరు కట్టే పద్ధతిద్వారా ఎకరం ఒక్కంటికీ 1 నుండి 2 టన్నుల వరకూ పండించే శక్తి, అనావృష్టికి తట్టుకునే వరి పంట రకాలకు సహజమైనదన్న విషయం, డాన్, క్యూబన్, ఉక్రెయిన్ సమిష్టి క్షేత్రాలలో విస్తారంగా ఆచరణలో పెట్టిన తరవాత నిరూపింపబడింది.

వరిపంటకు సంబంధించిన వైజ్ఞానిక పరిశోధన గురించి మాటాడేటప్పుడు, చాలా మంది ప్రవీణులూ, సమిష్టిరైతులూ, ప్రభుత్వ క్షేత్రాల, మెషిన్ ట్రాక్టరు స్టేషన్ల పనివారూ వరిపొలాలలో చేసిన కృషిని మనం పేర్కొనవలసి వుంటుంది. విజ్ఞానశాస్త్రరంగంలో పని చేసేవారి జాబితాలో వారి పేర్లు వుండకపోవచ్చును. కాని వరిసాగు పద్ధతులను అభివృద్ధి చేసే సందర్భంలో వారి సమిష్టి కృషిని అతిశయోక్తిగా చెప్పలేము. వరిసాగులో వివిధ పద్ధతుల ఫలితాలను గురించి వారు జాగ్రత్తగా పరిశీలనలను జరుపుతారు, పెద్ద వరి పంటలను పండించడంలో అపారమైన అనుభవాన్ని సేకరిస్తారు. ఈ అనుభవాన్ని పరిశీలించినట్టయితే, వరిపంటకు సంబంధించిన సిద్ధాంత, ఆచరణలకు ఎంతో విలువైన విషయాలు లభిస్తాయి.

వరిసాగు విషయంలో భారత దేశం సంపాదించిన అనుభవాన్ని సోవియట్ విజ్ఞాన శాస్త్రజ్ఞులు చాలా విలువైన దానిగా పరిగణిస్తారని, యీ వ్యాసాంతంలో నేను చెప్పదలుచుకున్నాను. భారతీయ విజ్ఞానశాస్త్రజ్ఞుల కృషి ప్రచురింపబడినప్పుడు, వారు ఎంతోఆసక్తితో దానిని పఠిస్తారు. అనుభవాన్ని పదేపదే యిచ్చి పుచ్చుకోవడంవల్ల, యీ రెండుదేశాల వరి సేద్యకారులకు యెంతో ఉపయోగకరముగా వుంటుంది.

# నొవొసిబిర్స్క్ జల విద్యుత్కేంద్రం

యా. గోల్దిన్

నొవొసిబిర్స్క్ నుండి జలవిద్యుత్కేంద్ర నిర్మాణస్థలం వేపున వున్న రోడ్డు. ఫిర్ చెట్ల అడవులకు మధ్యగా ఓబ్ నదికి సమానాంతరంగా పోతుంది.

ఆల్తాయ్ పర్వతాలమీద పుట్టిన యీ మహత్తర సైబీరియన్ నది, తన జలాలను 5 వేల కిలోమీటర్లకు పైగా దూరానికి తీసుకపోతుంది. జలశక్తి ఇంజినీర్ల లెక్కల ప్రకారం ఓబ్ నది యొక్క జలశక్తి ఆధారాలు ఐదువేలకోట్ల కిలోవాట్ గంటలకు సమానం.

ఓబ్ నది మీద ఎనిమిది బలోపేతమైన విద్యుత్కేంద్రాలను నిర్మించడానికి ఉద్దేశింపబడింది. వాటిలో ఒకటి—నొవొసిబిర్స్క్ జల విద్యుత్కేంద్రం, ప్రపంచంలోకల్లా పెద్దదిగా వుంటుంది.

ఓబ్ పైన నిర్మించడానికుద్దేశింపబడిన ఎనిమిది విద్యుత్కేంద్రాలలో, యీ కేంద్రం మొదటిది. దీని నిర్మాణం యించుమించుగా పూర్తి అయ్యింది. ఈ కొత్త జలవిద్యుత్కేంద్రం సంవత్సరానికి 1,800,000 కిలోవాట్ గంటల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేస్తుంది. బొగ్గునుండి యిదే మొత్తం విద్యుచ్ఛక్తిని సేకరించడానికి, మనం 1.5 మిలియన్ టన్నుల బొగ్గును వాడకం చేయవలసి వుంటుంది: ఈ కొత్త విద్యుత్కేంద్రపు తొలి భాగాలు యీ ఏడాదిసరికే పనిని మొదలు పెడతాయి, మిగిలినవి 1958లో పనిలోనికి వస్తాయి. ఈ కేంద్రం మొత్తం కెపేసిటీ 4 లక్షల కిలోవాట్లుంటుంది.



జలశక్తి ప్రవీణ బృందనాయకుడు ఓబ్ నదిమీది మంచు కొలత తీస్తున్నారు

230 కిలోమీటర్ల పొడవూ, 22 కిలోమీటర్ల వెడల్పూగల బ్రహ్మాండమైన జలాశ్రయం. నది ఎగువ భాగాలలో పెద్ద సముద్రం లాగా వుంటుంది. ఇందుకు 16 మిలియన్ క్యూబిక్ మీటర్ల మట్టిని త్రవ్వవలసి వుంటుంది.

సాధారణంగా జరిగినట్టుగా కాకుండా యీ కేంద్రం నిర్మాణం ఎక్కువ పొదుపుగా జరుగుతుంది. ఈ నిర్మాణ కార్యపు ముఖ్య కట్టడాల పొడవు ఎంతో తగ్గింపబడింది. అంటే కాంక్రీటు, లోహం మొదలైన నిర్మాణవస్తువులు ఎంతో పొదుపు చేయబడతాయన్నమాట.

(మిగత 37వ పుటలో)

జల విద్యుత్కేంద్ర నిర్మాణం ఇంకా పూర్తికాలేదు, అయినా అప్పుడే ఇక్కడ ఒక పట్టణం వెలిసింది





# డాన్బాస్ గనులలో ఆరుగంటల పని-రోజు



వి. రుదిన్

డాన్బస్ గనులలో పనిచేసే కార్మికులు, యితర గనులలో పనిచేసే వారిలాగానే, పూర్వం రోజుకు ఎనిమిది గంటలు పనిచేసేవారు. ఇటీవల సమీకరణలోనూ, ఉత్పత్తిలోనూ పెద్ద మార్పులు చాలా డాన్బస్ గనులలో ప్రకటింపబడ్డాయి. వీటి అన్నిటిలో ముఖ్యమైనది, ఆరుగంటల పనిరోజును ప్రవేశపెట్టిన మార్పు.

గనిలోనుంచి కార్మికులు బయటికి వస్తోన్న దృశ్యం



దీని ప్రాముఖ్యం ఏమిటి? ఇది బొగ్గు ఉత్పత్తి పైని ఎలా ప్రభావాన్ని చూపింది. ఇది గని కార్మికులకు లాభాన్ని చేకూర్చిందా?

ఈ ప్రశ్నలకు సమాధానాలకోసం మేము చెల్యుస్కిన్‌త్సీ ఒకటో నెంబరు పిట్‌కు వెళ్ళాము.

మా మనస్సులలో అన్నిటికంటె ప్రధానంగా వున్న విషయం, సహజంగా ఉత్పత్తికి సంబంధించిన విషయం.

ఏడవ విభాగపు అధిపతి నికొలాయ్ ఫెసెంకో మాకీవిధంగా చెప్పారు: "ఈ కొత్త పద్ధతిని ప్రవేశపెట్టడంతో, మా పథకంలో 80 టన్నులు హెచ్చింపబడింది. అయినప్పటికి మా ఉత్పత్తి యీ హెచ్చింపబడిన పథకం కంటె కూడా ఎక్కువగా వుంది."

ఇదెలా సంభవించింది?

మొదటిది, ఉత్పత్తి సమీకరణలో మార్పులు జరిగాయి. మూడు ఎనిమిది గంటల షిప్టుల్లో పనిచేయడానికి బదులుగా, యిప్పుడు పనివారు నాలుగు ఆరుగంటల షిప్టుల్లో పనిచేస్తారు. మూడు షిప్టులు బొగ్గును తవ్వుతాయి. నాలుగోది పూర్తిగా మరమ్మత్తు పనులు చేస్తుంది, ఈ పద్ధతి, ఉత్పత్తి ఆగకుండా సాఫీగా సాగడానికి తోడ్పడుతుంది. భూగర్భంలోని రవాణా పద్ధతికూడా పునస్సమీకరింపబడింది. భారీ రైలుబళ్లు వచ్చాయి, ఎలెక్ట్రిక్ రైలుబళ్ళ వేగం హెచ్చింది.

రెండోదీ, యింతకంటె ముఖ్యమైనదీ అయిన కారణం, గని కార్మికులను ఉత్పత్తితో యింకా నేరుగా కలిపిన మార్పు. పాత పద్ధతి ప్రకారం ప్రతిరకపు పనికీ, వేరు వేరు ప్రమాణాలుండేవి. అంచేత, అందరూ జట్లుగా కలసి పనిచేసినప్పటికీ, వారు వ్యక్తులుగా విడివిడిగా కూడా పనిచేసేవారు. దీనిలోని అధమాధమమైన విషయమేమిటంటే, ఒకొక్కరూ తన గురించి మాత్రమే ఆలోచించుకునేవారు. ఒక షిఫ్టు అనుకున్న మొత్తం బొగ్గును ఉత్పత్తి చేయకపోయినా, కోల్-కట్టర్ ఇవనోవ్‌కూ, ప్రాప్-మన్ సిదొరోవ్‌కూ, వారు తమ ప్రమాణాలను మించి పనిచేసినట్టయితే, అధిక వేతనాలకు హక్కుండేది.

ఇప్పుడు వ్యక్తులకు విడివిడిగా ప్రమాణాలను యివ్వడానికి బదులుగా యావత్తు జట్టుకూ ఒక పథకం యివ్వబడుతుంది. ఆ బృందం ఎక్కువ బొగ్గును ఉత్పత్తి చేసినట్టయితే, దాని ఆర్జన ఎక్కువవుతుంది. గని కార్మికులకు మంచి కొత్త ప్రేరణను ఇచ్చిన

యీ పద్ధతి, పనిపట్ల వారి దృక్పథంపైని వెంటనే ప్రభావాన్ని చూపింది. ఉత్పత్తిని హెచ్చించడంలో ఒక్కొక్కరి ఆసక్తిని హెచ్చించింది.

## [illegible]

ఇది గని కార్మికుల ఆదాయాల విషయాన్ని తీసుక వస్తుంది. అవి హెచ్చాయా, తగ్గాయా ?

మేము నికొలాయ్ బెరెజోవ్‌స్కీని కలుసు కున్నాము. కలప స్టోరు గదిలో యీయన లోడర్‌గా పనిచేసేవాడు. గని కార్మికుల ఆదాయాలు పెరిగాయని విని, అతను వెంటనే పిట్‌లో పనిచేయ డానికి వచ్చాడు.

"బాగావుందా ?" అని మేము అడిగాము.

"అవుననే చెప్పాలి. ముందుకంటె యిప్పుడు నేను మూడు రెట్లు గడిస్తున్నాను" అని బెరొజొవస్కీ జవాబిచ్చాడు.

మొత్తం జట్టంతా కలిసి ఉత్పత్తిలో తెచ్చిన వృద్ధివల్ల ఒక గని కార్మికునికి ఆదాయం పెరిగినట్టే, వేతనాల పద్ధతిలో కొన్ని కొత్త మార్పులను ప్రవేశపెట్టడం కూడా గని కార్మికుల ఆదాయాలు పెరగడానికి కారణమైంది.

మేము వాసిలీ కిప్కాను కలిశాము. ఈయన గనుల్లో పాత కార్మికుడు. ఈయన ఒక కంబైన్‌ను నడిపాడు. కంబైన్ ఆపరేట రుగా వున్నప్పుడు కిప్కాకు, యితరులకు చాలామందికి చాతకానట్టే తన యంత్రాన్ని మరమ్మత్తు చేసుకోవడం చాతకాదు. ప్రవీణులు దీనికి అవసరమయ్యేది. రెండు మాసాలు నేర్చుకున్నాక కిప్కా రెండో వృత్తిని నేర్చుకున్నాడు. ఇప్పుడతనికి, ఆపరేటర్, మెకానిక్ అంటారు. తత్ప్రకారం అతని జీతం హెచ్చింది. ఈ కొత్త ఏర్పాటు గనికీ, పనివానికీ లాభదాయకం.

కిప్కాకు పెరిగి పెద్దవారవుతోన్న నలుగురు కొడుకు లున్నారు. జీవితంలో స్థిరపడడానికి వారందరికీ సహాయం అవసరం. ఒక కొడుకు గని విద్యాలయంలో విద్యార్థి తక్కినవాళ్ళంతా పాఠ శాలకు వెళ్తున్నవాళ్ళు. కాని వాళ్ళకు కూడా తప్పకుండా కళాశాల విద్య లభిస్తుంది. వాసిలీ కిప్కా నెలసరి ఆదాయం 4000–5000 రూబుళ్ళు. మంచి మొత్తం. "అదనపు" మొత్తం అతని సేవింగ్స్ బ్యాంక్ అకౌంట్‌లోనికి పోతుంది. అతను "పొబేదా" కారును కొనాలనుకుంటున్నాడు।

ఈ కొత్త మార్పును ప్రవేశపెట్టడంవల్ల యింకో గొప్ప లాభం వుంది. ఇతర గనులలో చాలా అవసరమైన చాలా మంది ప్రవీణులను యిది విడుదల చేస్తుంది.

గని కార్మికుల ఆదాయాలలో పెరుగుదలను సూచించడానికి, పనివారి సేవింగ్స్ బ్యాంకు పుస్తకాలు గట్టి సాక్ష్యంగా వుంటాయి. స్థానిక సేవింగ్స్ బ్యాంక్ అధికారిణి వాలంతీనా మార్కోవా, కొత్త చెల్లింపు పద్ధతిని ప్రవేశపెట్టబడిన తరవాత. వీరి డిపోజిట్లు 2,200,000 రూబుళ్ళకు పైగా హెచ్చాయని చెప్పింది.

## కార్మికులు లాభపడ్డారు

గని కార్మికులు యీ మార్పులకు సంతోషిస్తున్నట్టుగా మేము కనుగొన్నాము. వారిలో ఒకరిలా చెప్పారు : "మేము యిప్పుడు లంచిని తీసుకోవడంలేదు. ఎందువల్లంటె మా బ్రేక్‌ఫాస్ట్. డిన్నర్

(మిగత 37వ పుటలో)



నికొలాయ్ రొగొజ్నికోవ్ అభిమాన కళ



శనివారంనాడు 250 మంది షెఖ్టిన్స్కీన్ వాసులు నగర ప్రదర్శనశాలను సందర్శించారు



# కడలి లోతుల్లో సో



వింతగా, అబ్బురంగా కనిపించే ప్రొజెక్టయిల్ పసిఫిక్ మహా సముద్రపు అడుగుకు దిగుతోంది. దట్టమైన న్యబ్జ దర్పణాల ప్రకాశ కాలద్వారా పరిశీలకుడు కడలి కడుపులోని అద్భుత ప్రపంచాన్ని చూడవచ్చును. ఆ ఆకుపచ్చని వెలుతురులో పని నిత్యం సాగిపోతూవుంది. భయంకరమైన సొర్ర చేపలు, తప్పించుక పోవడానికి ప్రయత్నించే చేపలను వెంటాడుతున్నాయి. బ్రహ్మాండమైన అష్టపాద జలచరం యొక్క పువ్వారాలు లోపలికీ పైకీ వెళ్తున్నాయి, కళ్ళు తిప్పుకుంటూ ఎండ్రపీతలు తమ డెక్కలను పెనవేసుకుంటూ వున్నాయి.

ఏదో ఒక కథలోని వీరనాయకుని సాహసిక యాత్రాగాధ కాదిది. ఒక అద్భుతమైన నవలలోని ఒక దృశ్యాన్ని మనం వర్ణించడం లేదు. మాస్కో సినిమా స్టుడియోకు చెందిన అలెగ్జాండర్ జ్గురిది నిర్మించిన ఒక ఫిల్ములోని దృశ్యాలు మాత్రమే యివి. సుగమ విజ్ఞాన చలనచిత్ర గృహాణంలో జీవశాస్త్ర చిత్రాల ప్రారంభకులలో యీయన ఒకరు. ఈ కొత్త చిత్రం పేరు "పసిఫిక్ మహా సముద్రంలో". కెమేరామన్, ఒక స్త్రీ. నీనా యురుష్కినా అన్నామె.

లిడియా

ఈ వింత ప్రొజెక్టయిల్, నీటి అడుగున చలనచిత్రం తీయడానికి ప్రత్యేకంగా నిర్మింపబడిన యీ హైడ్రోస్టాట్, నీనా యురుష్కినా జలగర్భంలోని కార్యాలయం. సముద్రపు లోతుల్లోనికి పంపబడిన, సినీమా స్టుడియోలోని ఒక భాగం అది. తన కెమేరాతో నీనా యురుష్కినా తన హైడ్రోస్టాట్‌లో సదుపాయంగా వుంది. అక్కడ వెచ్చగా వుంది, వాతావరణపు ఒత్తిడి సాధారణంగా వుంది. యీ యాత్రకు సంబంధించిన నీటిమీద స్థావరానికి ఆమె టెలిఫోను కూడా చేయవచ్చు.

హైడ్రోస్టాట్ సముద్రపు అడుగున ఒకేసారి అనేక గంటలు వుండిపోతుంది. దాని కాంతి ప్రసారక సాధనాలద్వారా యీ కెమేరా మనిషి, సాధారణంగా మానవ నేత్రానికి కనిపించని జీవిత చిత్రాలను చూసి, తీయవచ్చును.

## క్రూరమైన మొక్కలు

నగం నీలపు చీకటిలోవున్న జలాంతరారణ్యాల్లో ఒక అద్భుతాల

పైన: నీటిలో ముంచుటకు ఒక జలస్థాపక సాధనం సిద్ధపర్చబడుతున్నది
ఛాయాచిత్రాలు: ఎన్. యురిష్కినా
మధ్య: "స్టార్ ఫిష్"తో నీటి అడుగు ఈతగాడు క్రింద: నీటిలో వేటగాళ్లు









లోకం కనిపిస్తుంది. సిందూర చాయలోని రెండురేకుల మాంస వర్ణపు పూవులను పోలిన అతి చక్కని వింతపూవులు యిక్కడ విరియ కాసి వున్నాయి. పీచు రేగివున్న తెల్లని చామంతులు తమ అండాశయాలను చుట్టివుండే పత్రాలను విప్పుతున్నాయి. వాటి రేకు లెంతో సున్నితమైనవి, పోర్సిలిన్ యొక్క చక్కని దారాలను యివి పోలివున్నాయి. ఆ చిన్నచేప ఆ తెల్ల పూవును దాటి యీదుకుంటూ పోవడం చూడండి। వెంటనే ప్రాణంతో వున్న ఆ పూరేకులు, తమ బలిని మృత్యు ఆశ్లేషంలో బంధించి వేశాయి ఆ చక్కని మాంస వర్ణపు పూలు, చామంతులూ పూలు కానేకావు. అవి క్రూర జంతువులు, సముద్రపు గాలిపూవులు (అనేమని). తమ స్పర్శ శక్తిగల రేకులతో అవి తమ బలిని పట్టుకుని స్తంభింపజేస్తాయి, పీల్చి మింగివేస్తాయి.

యూ వి చ్

సముద్రం తన మామూలు జీవితాన్ని సాగిస్తోంది. ప్రమాదకరమైన దైనప్పటికీ, అద్భుతమైన యిటువంటి వృత్తిని యెంచుకున్న కెమేరా పనికత్తె సీనా యురుష్కినాతో, యీ హైడ్రోస్టాట్ సముద్రపు అడుగున పయనిస్తోంది.

అన్ని రకాల విషయాలూ, అన్ని వేళల్లోనూ జరుగుతూ వుంటాయి. చిన్న సూర్యునివలె నున్న స్టార్‌ఫిష్ వున్నాయి. కాని అవికూడా క్రూర జంతువులే. వాటి "కిరణాలు" ముల్లుస్క్ డిప్పలను విరగొట్టగలవు. స్టార్‌ఫిష్‌కంటె వాటి బలి పెద్దదన్న విషయం, ముఖ్యంకాదు. స్టార్‌ఫిష్ తన కడుపును ముందుకూ వెనకకూ సారించి తన బలిని లోపలికి లాగుకుంటుంది.

## విజ్ఞానశాస్త్ర సహాయానికి సినిమా

తెరపైని సముద్రగర్భంలోని ప్రపంచపు అద్భుతాలను చూపడానికి, యీ ఫిల్ము నిర్మాతలకు చాలా ఓపిక, సమయజ్ఞత, దీక్ష అవసరం అయ్యాయి. వారు తమ "పాత్రల"ను గంటలతరబడిని చూడవలసివచ్చింది, కష్టపడి వాటి జీవిత విధానాన్ని, తమ సహజ పరిసరాలకు అవి అలవాటు పడే పద్ధతులను గమనించ వలసి వచ్చింది.

చెవులుగల సీల్, కమ్చట్కా బీవర్, సముద్రపు ఎలుగుబంటి వంటి పసిఫిక్ మహాసముద్ర నివాసులైన పెద్దజంతువుల జీవితాన్ని గ్రహించడానికి,

పైన: చేపను పట్టుకుంటున్న ఒక జలచరం
క్రింద: "త్యులేనీ" దీవిలోని పిట్టల గుంపులు





చిత్రించడానికి చాలా చమత్కారపు పద్ధతులను అవలంబించడమూ, చాలా శ్రమ పడడమూ అవసరం. అతి విలువైన కమ్చట్కా బీవర్ అన్న జంతువు జీవించే శిలామయమూ, అగమ్యమూ అయిన

(మిగత 23 పుటలో)





# ముగ్గురు



విక్టర్ సొజెవిచ్





మాస్కో పురవాసులకు వ్లాదిమిర్ లెంపోర్ట్, వదిం సిదుర్, నికొలాయ్ సిలిస్ పరిచయ మయ్యింది, సోవియట్ దేశ లలితకళా పరిషత్తు హాల్సులో గత ఆకురాలుకాలంలో ఏర్పాటు చేయ బడిన యువ కళాకారుల ప్రదర్శనంలో. చిన్న విగ్రహాలకూ, రూప శిల్పాలకూ, ఉబ్బెత్తు చిత్రాలకూ చుట్టూరానే—యీ ముగ్గురు కళా కారుల కృషి ఫలితాలివి—ఎక్కువగా ప్రేక్షకులు గుమిగూడేవారు. ఈ కళావస్తువులు ప్రదర్శింపబడిన హాల్సులో రొంద చాలా ఎక్కువగా వుండేది. అవి హర్షామోద ప్రకటనలతోనూ, తీవ్రచర్చలతోనూ, సుస్థాపితమైన సూత్రాలకు తల వెంట్రుకవాసి తప్పి వెళ్ళినా అంగీకరించలేని వారి గొణు గుళ్ళలో కూడా ప్రతిధ్వనించేవి ఈ ముగ్గురు కళాకారుల రచనలపట్ల వచ్చిన అభి ప్రాయాలనుబట్టి. అవి ఉత్తమమైనవని తేలింది. నిజమైన కళారచనలు సామాన్యులలో కదలికను కలిగించకుండా వుండవుగదా. అవి సర్వదా వారిని ఉత్తేజపర్చుతాయి; వారిని జీవిత సమస్యల గురించి కళాపథాల పురోగతి గురించి ఆలోచించేటట్టుగా చేస్తాయి.

లెంపోర్ట్, సిదూర్, సిలిస్ గురించి యువ చిత్రకారులని మనం అంటున్నాం, కాని అనుభవంలో వారు వృద్ధులే యుద్ధకాలములో వారు సైనికులు. యుద్ధరంగాల్లో వారు పోరాడేరు. యుద్ధం తరవాత వారు కళా విద్యాలయంలో కలుసుకున్నారు, మిత్రుల య్యారు. వారి స్నేహం ఎంత గాఢంగా వృద్ధిపొందిందంటే, యిప్పుడు వారిలో ఒకరు తమ స్టుడియోకు రాకపోయినట్టయితే, వారు సరిగ్గా పనిచేయలేరు.

వారి కళా రచనలు ఎందువల్ల అంతగా చర్చను రేకెత్తిస్తాయి? వాటిలో అంతగాగల నవ్యత, అసాధరణత్వమూ ఏమిటి?

మనరోజుల్లో కళలో, అంటే నిజమైన వాస్తవిక కళలో కొత్త పుంతలు తొక్కడం అంత తేలికైన పనేమీ కాదు. కాని యీ ముగ్గురు యువ కళాకారుల రచనలు, తమ అన్వేషణల్లో వారు కొన్ని అసాధారణ ఫలితాలను సాధించారని తెలియజేస్తాయి.

ఇవి ముఖ్యంగా చిన్న ప్రమాణంలోని శిల్పాలు, జీవితంలో పరిశీలింపబడి, మందస్మితంతో రూపొందింప బడినవి.

చలవరాయిగాని, కంచుగాని కాదు, వారి అభిమాన వస్తువు. అది రకరకాల సామాన్యమైన మట్టి. సిద్ధమైవున్న విగ్రహం అప్పు డప్పుడు వార్నీషులో ముంచబడి, తరవా తను ఒక ఎలెక్ట్రిక్ పొయ్యిలో కాల్చబడుతుంది. ఆ తరవాత అది రాయిలాగా గటిపడిపోయి, దానికొక





అపురూపమైన సౌందర్యం వస్తుంది. ఈ వస్తువు చాలా సామాన్యమైనది, చవక. కొందరు మట్టికి బదులుగా పోర్సిలిన్‌ను ఎంచుకుంటారు. కాని సిద్ధహస్తులైన యీ యువకులకు మట్టిలో తమ కృషిలోని నిరాడంబరత్వమూ, జాతీయ జానపదత్వమూ ప్రస్ఫుటం గావించే గుణాలు కనిపించాయి.

వారి పని తీరు, అది ధరించే రూపాలూ యీ శిల్పుల అన్నిటి కంటె ముఖ్యంగా, భావప్రకటనకు ఎక్కువగా—కొన్ని కొన్ని సందర్భాలలో చిత్రంలోవలె సైతం—కృషి చేస్తారు.

లెంపోర్త్, సిదూర్, సిలిస్‌తో మన పరిచయం, వారి పెద్దవైన గొప్ప రచనలను పేర్కొనకుండా పూర్తికాదు. అవి వార్సాలోని విజ్ఞాన భవనంమీది విగ్రహాలు, మాస్కోలోని కొత్త స్టేడియం గృహాలపైనున్న ఉబ్బెత్తు బొమ్మలూ, రష్యాతో ఉక్రెయిన్ ఏకీకరణ 300 వార్షికోత్సవచిహ్నంగా గొప్ప స్మృతి నిర్మాణానికి తయారు చేసిన డిజైను (యిది మాస్కోలో వుంటుంది).

భారతీయ కళావేత్తలకు సంబంధించిన అనేక విగ్రహాలను *యీ శిల్పులు తయారు చేశారని తెలుసుకుంటే మా భారతీయ పాఠ*కులు సంతోషిస్తారని భావిస్తాము. మాస్కో పురవాసుల్లాగానే నర్తకి తారాచౌదరి, కళాకారుడు గోపీనాథ్, గాయకుడు ఆశాసింగ్ మస్తానా, సోవియట్ దేశంలో ప్రదర్శనలిచ్చిన యితర నర్తకులు, గాయకులు చూపిన సమ్మోహనకరమైన కళకు వారుకూడా పరవశులయ్యారు.



## కడలి లోతులకుపోయిన కాంత

(21వ పుట తరువాయి)

సెయింట్ జార్జ్ దీవినీ, కురైల్ దీవులనూ యీ సినిమా బృందం అన్వేషించవలసి వచ్చింది.

విజ్ఞానశాస్త్ర సలహాదార్లతో కలసి చేసిన పరిశీలనల ఫలితంగా ఫిల్మ్ సినేరియోలోనే కాకుండా, యీ జంతువుల జీవితం గురించి విజ్ఞానశాస్త్రజ్ఞులకు గల కొన్ని భావాలలో కూడా పెద్ద మార్పులను తీసుకురావలసివచ్చిందని యీ ఫిల్మ్ దర్శకుడు చెప్పారు. ఉదాహరణకు కమ్చత్కా బీవర్ చేపలనూ, మొల్లస్కులనూ మాత్రమే తింటుందని భావింపబడేది. కాని యిటీవల జంతుశాస్త్రజ్ఞులు తెరమీద కమ్చత్కా బీవర్ సముద్రపు కలుపు మొక్కలను తింటూ వుండడం చూసి చాలా ఆశ్చర్యపడ్డారు.

ఇటువంటి సందర్భాలు చాలా వున్నాయి. సుగమ వైజ్ఞానిక చలనచిత్రాన్ని నిర్మిస్తూ చలనచిత్ర గ్రాహకులు విజ్ఞానశాస్త్రానికి కొత్త సత్యాలను సేకరించడం పలుసార్లు సంభవించింది.

## జాగ్రత్త! వీరులు కరుస్తారు!

దర్శకుడు జ్గురిది యాత్ర, నావికులకు బాగా తెలిసిన, ఒఖొత్స్క్ సముద్రంలోని సీల్ దీవికి వెళ్లారు. ఈ దీవి వీరికి ఒక విధమైన మార్గదర్శిగా వుంది. ఆ దీవిలో పెద్ద సంఖ్యలో వున్న సీలు అన్న సముద్ర జంతువుల రొద ద్వారా, వారు పొగమంచులో సైతం యీ దీవి ఎక్కడ వున్నదో చెప్పగలరు.

మన ఎదుట సముద్రతీరం సీళ్లతో దట్టంగా కిక్కిరిసి వుంది. వీని ఉన్ని విలువైనది. ఈ జంతువులు క్రూరమైనవి, తమ తీరానికి ఎవరు వచ్చినా నిర్దాక్షిణ్యంగా తరిమివేస్తాయి.

సీళ్ళు అల్లకల్లోలంగా తీరంపైని గుమిగూడుతాయి, ఎండ కాగుతాయి, జలక్రీడలాడుతాయి. అవి గుంపులు కూడడంలోనూ, నేలను అణగదొక్కడంలోనూ, రొదచేయడంలోనూ క్రమపద్ధతి ఏదీ వున్నట్టుగా లేదు. అయినా అక్కడ ఎంతో క్రమశిక్షణ కనిపిస్తుంది. ఈ జంతువులు నిర్దిష్టమైన న్యాయ సూత్రాల ననుసరించి జీవిస్తాయి— ఆ సూత్రాలు అలేఖ్యమైనవైనప్పటికీ అవి "బహు భార్యలు" గలవి; తమ "రాణి వాసం"లో చాలా తీవ్రమైన నిబంధనలను పాటిస్తాయి.

చిన్న సీళ్ళు, పెద్దవాటికి ఎడంగా వుంటాయి. వాటికి "బాలోద్యానవనాలు"న్నాయి....

తల్లులు తమ పిల్లలకు మేత పెట్టడానికి పిలిచినప్పుడు, యీ కెమేరా పనికత్తె చాలా చక్కని దృశ్యాన్ని తీసింది. ఇది నిజంగా అపూర్వదృశ్యం. ప్రతి ఆడ సీలుకు ఒక్క పిల్లమాత్రమే వుంది. తన తల్లి పిలిస్తేనే అది వస్తుంది.

ఈ ఫిల్మ్ దర్శకుడు, అతని బృందమూ పసిఫిక్ సముద్రంలోని అసాధారణమైన, వైవిధ్యంగల జీవితాన్ని మనకు పరిచయం చేశారు. నీటిలోతుల్లో నివసించే జంతువులను వారు పూర్తిగా చూశారు, వాటి అలవాట్లనూ, యిచ్ఛలనూ పరిశీలించారు. కొంతవరకూ వారే జీవశాస్త్రజ్ఞులయిపోయి, ఒక ప్రత్యేకమైన అన్వేషణా పద్ధతిని, క్లిష్టమైన సాధనాలను డిజైన్ చేయడమూ, నిర్మించుకోవడమూ పెంపొందించుకున్నారు.

కళ్ళు మిరుమిట్లు గొలిపే వింతను దేనినో చూపి ప్రేక్షకుణ్ని దిగ్భ్రాంతుణ్ని చేయడానికికాక జ్ఞానాన్ని సుగమం చేయడానికీ, విజ్ఞానాన్ని ప్రజాబాహుళ్యానికి అందజేయడానికీ, యీ కృషి అంతా జరిగింది.



సోవియట్ బాలల రచయిత

# పెత్రొంగ బరుజీవ్ కథ



హటాత్తుగా బడిపిల్లవాడు మొరగడం మొదలు పెట్టింది.

"కక్కో మాయ్" అని కేకేశాడు ఉయ్‌రపక్. అంటే తనకు చాలా ఆశ్చర్యం వేసిందని అర్థం. భుజంమీంచి తుపాకిని జారవిడిచి అఖాతం చివరకు పరుగెత్తాడు. అతనిగుండె దడదడా కొట్టుకుంటోంది, అటువంటి దృశ్యం అతను చూశాడు.

ఒత్తుగా బొచ్చుపెరిగివున్న ధృవప్రాంతపు ఎలుగుబంటి పిల్ల ఒకటి. ఒక చిన్న కుక్క ప్రమాణంలో వున్నది. గండ శిలలమధ్య సముద్రతీరంలో పొర్లాడుతోంది. దాని వయసు మూడు నాలుగు మాసాలకు మించదు. అది బడిపిల్లవాని దాడులనుండి శాయశక్తులా ఆత్మరక్షణ చేసుకుంటోంది.

## ఉయ్‌రపక్‌కు కుక్కపిల దొరికింది

య్‌రపక్ ఎస్కిమో కుర్రవాడు. అతను ఛుకోత్‌స్క ద్వీపకల్పంలో ఉంటున్నాడు. అది ఉత్తరాదిని దూరంగా వుంది. ఒకరోజున అతను "ఇగా-ల్యంగె-సంగె .. "అని తనలోతాను పాడుకుంటూ వేటనుండి తిరిగివస్తున్నాడు.

అతనికి ముందుగా పరుగెత్తుతోంది, బడిపిల్లవాడు, ఇదొక ఎస్కిమో కుక్క, దీనికి పొడవాటి నల్లని జుట్టు వుంటుంది. ఉయ్‌రపక్ తండ్రి ఆ కుక్కపిల్లను యింటిక తీసుకవచ్చినప్పుడు, అతను నాలుగేళ్ళక్రిందట దానికాపేరుపెట్టాడు ఆ రోజుల్లో అప్పుడప్పుడే అతను బడికి వెళ్ళడం మొదలుపెట్టాడు అతనికి ఒక్కటే ఒక్క రష్యన్ మాట తెలుసును. అదే "బడిపిల్లవాడు" అన్నది. ఆంచాత అతను ఆ కుక్కపిల్లకు "బడిపిల్లవా"డన్న పేరుపెట్టేశాడు.

కాని యిప్పుడు "బడిపిల్లవాడు" బాగా పెరిగి పెద్దదయిపోయింది ఉయ్‌రపక్ కూడా బాగానే పెరిగాడు అతనిప్రాయం పన్నెండేళ్ళు.

గ్రామం చేరడానికి వాళ్ళింకా ఎంతోదూరం వెళ్ళక్కర్లేదు. ఉయ్‌రపక్ సముద్రపు ఒడ్డునుండి మళ్ళి పల్లపు ప్రదేశంలోనికి దిగాడు

"ఉతగ్-మున్ ! యిక్కడికిరా, బడిపిల్లవాడా !"అని ఉయ్‌రపక్ అరిచాడు

బడిపిల్లవాడు మెల్లగా ఎలుగుబంటి దగ్గర్నుండి వచ్చేసి, తన యజమాని పాదాలమీద వాలింది

ఎలుగుబంటి పిల్లకు దగ్గర్లో వుండడం ప్రమాదకరం దాని తల్లి ఏకక్షణాన్నయినా అక్కడికి రావచ్చు అప్పుడు ఉయ్‌రపక్‌కు యిబ్బంది తప్పదు. ఎలుగుబంట్ల వేట నిషేధింపబడింది. అంతే కాకుండా తొలి దెబ్బకే ఎలుగుబంటి చావకపోవచ్చు

కాని తల్లి ఎలుగుబంటి రాలేదు ఉయ్‌రపక్ ఒకరాతికి వెనక కాచుకుని వున్నాడు. గాలి ఎదురుగా కొడుతోంది. అందువల్ల ఎలుగుబంటి పిల్ల. ఆ కుర్రవాణ్ణీ కుక్కపిల్లనూ పసికట్టలేదు ఈలోగా ఎలుగుబంటి పిల్ల తీరంలో యిటూ అటూ పరుగెత్తుతోంది. ముక్కుతూ. మూలుగుతూ, గాలిని ఎగబీల్చుతూ.

కొన్ని నిమిషాలు గడిచాయి. తల్లి వచ్చే సూచనేమీలేదు. బడిపిల్లవాడు ఉద్రేకంతో కంపిస్తోంది ఇప్పుడది మొరగడం లేదు. తరవాత ఎలుగుబంటి పిల్ల చల్లబడి, నీటికి అంచున పడుంది. అది తన

ఈ కథను సంక్షిప్తంచేసి ప్రచురిస్తున్నాము,

తలను ముంగాళ్ళ పంజాలమీద ఆన్చుకుని పరుంది. దాని చెవులు చాలా చిన్నవి, దట్టమైన బొచ్చులో అవి సరిగా కనిపించవు.

"ఇది ఏడుస్తున్నట్టుంది" అనుకున్నాడు ఉయ్‌రపక్. పాపం ఆ చిన్న జంతువుకోసం అతని మనసు బాధ పడింది. దాని దగ్గరకు పరుగెత్తుకుని వెళ్ళి, దాని జూలును దువ్వుదా మనుకున్నాడు. కాని మనసు మళ్ళించుకుని, వేచి వున్నాడు. దూరంగా పిట్టలు సంతలో లాగా గోల చేస్తున్నాయి. గులాబీ రంగుగల నీటికాకుల వింతకూతలు మాత్రం, యీ గోలలో పోలికకు దొరుకుతాయి.

ఎలుగుబంటి పిల్ల కదిలింది, వెనుక కాళ్ళమీద కూచుంది, ఇందువల్లనది పెద్ద కుక్కపిల్లలా కనిపించింది.

ఉయ్‌రపక్ రాతి వెనుకనుండి వచ్చాడు, ఎలుగుపిల్ల నిటారుగా నిలబడి అరిచి, వెనుకకు తగ్గింది. ఇదిచూసి ఉయ్‌రపక్ తన ఉన్ని జుబ్బా తీసి, ఎలుగుపిల్లమీద వేశాడు; పిల్లను దానిలో చుట్టి ఆ మూటను పట్టుకున్నాడు. ఎలుగుపిల్ల మూతిని బయటపెట్టి, అకస్మాత్తుగా ఉయ్‌రపక్ బుగ్గను నాకింది.

"నువ్వు మంచిదానివి, పెంకెతనం చెయ్యకూడదు. ఇక్కడ ఒంటరి చావు చస్తావు."

## విశ్రాంతి లేని అతిధి

ఎలుగుపిల్ల మంచులాగా మెత్తగానూ, తెల్లగానూ వుండడం వల్ల, ఉయ్‌రపక్ దానికి మంచుబంతి అని పేరు పెట్టాడు.

ఇంటికి వెళ్ళేటప్పుడు అది అల్లరేమీ పెట్టలేదు. ఉయ్‌రపక్ దానికి మంచుబంతి అని పేరు పెట్టాడు.

ఇంటికి వెళ్ళేటప్పుడు అది అల్లరేమీ పెట్టలేదు. ఉయ్‌రపక్ జుబ్బా వెచ్చదనం దానికి సుఖంగా వున్నట్టుంది. కాని వాళ్ల యిల్లు చేరాక అది తన పనిని తాను మొదలుపెట్టింది.

"దీనికి జబ్బు వస్తుందేమో"నని అనుకున్నాడు ఉయ్‌రపక్. కాని ఎలుగుబంటి పిల్ల ముట్టె చల్లగానూ, తడిగానూ వుంది. అంటే ఆరోగ్యంగా బాగా వుందని అర్థం. దానికి ఆకలిగా వుండి వుంటుందనుకున్నాడు ఉయ్‌రపక్.

అతను ఒక పసిపాప బొమ్మతో పాల సీసాను వెతికి తెచ్చి, దానిలో కొద్దిగా వేడిపాలను పోశాడు. మంచుబంతి బొమ్మను మూచూసింది. తరవాత దానిని కరిచి పట్టుకుని పాలుతాగడం మొదలు పెట్టింది. కాని అది సగం పాలు తాగిందోలేదో, ఆ బొమ్మ ముక్కలైంది.

ఉయ్‌రపక్ దుకాణానికి పరుగెత్తాడు.

"మత్లూ మామయ్యా! పది పిల్లబొమ్మ లివ్వండి!" అనడిగాడు దుకాణదారును.

"కమ్మా మాయ్!" అన్నాడు మత్లూ మామయ్య." నీకు పదిమంది కొత్త తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ లేరే."

ఇంకో గంట తరవాత మంచుబంతి యింకో రెండు బొమ్మలను చప్పరించేసింది, మిగిలిన పాలతో బాటుగా మూడోదానిని ఇంచుమించుగా మింగేసింది.

ఉయ్‌రపక్ తండ్రి మధ్యాహ్నం అయ్యేసరికి, మరి ఆగలేకపోయాడు.

"దాని తల్లికోసం వెతుకుతాను. అది దూరం వెళ్ళిపోయి వుండదు. అది కనిపిస్తే, పిల్లను దానికి వదిలేద్దాము. ఈ గుడారంలో యిది మనతో వుండలేదు. నీకు యిది తెలియడంలేదూ" అన్నా డతను.

అతను పైని వేసుకునే బట్టలు వేసుకున్నాడు, తుపాకిని దట్టించి, ఒక కుక్కను వెంటబెట్టుకుని గుడారంనుండి బయలుదేరాడు, అతను సాయంత్రం అయ్యేదాకా తిరిగి రాలేదు. అతను అలసిపోయి, తడిసి ముద్దయివచ్చి, చడీచప్పుడూ లేకుండా ఒక ఎలుగుబంటితోలును నేలమీద విసిరేశాడు.

"అది చచ్చిపోయి నాకు కనిపించింది" అన్నా డతను, బట్టలు మార్చుకుని పైపు వెలిగించాక. "అదిజబ్బుతో చచ్చిపోయి వుంటుంది. అది రాళ్ళలో పడివుంది, దాని చర్మం ఒలవలేక నేను చచ్చాను. అది 400 కిలోగ్రాముల బరువు వుంటుంది."

"చూడు, నాన్నా!"అన్నాడు ఉయ్‌రపక్. ఎలుగుపిల్ల గుడారంలోని ఒక మారుమూలను ఆడుకుంటోంది. ఇప్పుడది చర్మాన్ని సమీపించి, తన చిన్న మోరను ఆత్రుతగా ఎత్తింది, ఆ చర్మం చుట్టూ అది తిరిగింది, అంతసేపూ దానిని జాగ్రత్తగా మూజూస్తూ. తరవాత సంతృప్తితో అది ఆ చర్మంమీదను పరుంది.

"ఇది తన తల్లిని పోల్చుకుంది, తెలివి తక్కువ దద్దమ్మ!" అన్నాడు ఉయ్‌రపక్ తండ్రి.

మంచు బంతి మెల్లగా అరిచింది. తరవాత ముడుచుకుని పరుంది, చురుకైన చిన్నకళ్లు చికిలించి, కాస్సేపటి తరవాత గాఢ నిద్రలో పడిపోయింది.

## మంచు బంతి, దాని యిరుగుపొరుగు వాళ్లు

మంచుబంతి జూన్ నెలలో మాస్కో జంతు ప్రదర్శనశాలను చేరింది.

"అది ఆరోగ్యంగానే వుంది" అన్నాడు జంతువైద్యుడు, దానిని పరీక్షించాక. ఒక కార్డులో యిలా వ్రాసేడు:" వయసు: నాలుగు మాసాలు; బరువు: ఆరు కిలోగ్రాములు, కేప్ ష్మిట్‌మీద

ఆ చిన్న తెల్ల ఎలుగుబంటి మిష్కా సుదూరపు ఉత్తర ప్రాంత వాసులలో బాగా పేరుమోసింది. తెల్లటి మంచు ప్రదేశాలలో తిరగటమంటే దానికి ఎంతో ఇష్టం. మంచు కప్పివున్న ఆ జారుడు కొండ కొసల మీది తన ఆవాసంలోఆదివుంది.ఆ ప్రాంతపు ఒంటరితనం దానికేమీ బాధాకరంగాలేదు



దొరికింది, చుక్చీ ద్వీపకల్పం, మే నెలాఖరులో. ఎస్కిమో బడి పిల్లలు జంతు ప్రదర్శనశాలకు కానుకగా పంపారు. విమానం మీద ఆర్కెంగెల్‌కు, అక్కడినుండి మాస్కోకు రైలులోనూ తీసుక రాబడింది."

తరవాత మంచుబంతికి స్నానం చేయించారు, ఒక వారం రోజులు విడిగా ఒక బోనులో పెట్టారు, తరవాత చిన్న జంతువులను పెట్టే దొడ్డిలోనికి వదిలి పెట్టారు.

ఈ దొడ్డి, మాస్కో జంతు ప్రదర్శన శాలలోని చాలా చక్కని తావు. మంచుబంతి కక్కడ చాలా వింతలు కనిపించాయి.

మంచుబంతికి పరిచయమైన మొదటి జంతువు మలిష్ అన్న గోధుమవర్ణపు ఎలుగుబంటి పిల్ల. తాను కూచున్న ఊగిసలాడే నిచ్చెనపై నుండి, అక్కడ జరుగుతున్నదంతా మలిష్ చూడగలదు. అది మంచుబంతిని చూడగానే, అదే క్రిందికి దిగి దానిదగ్గరకు పరుగెత్తింది.

మంచుబంతి వెనుకకుతగ్గింది. మలిష్ చిన్నదయినా ధైర్యంగా మంచుబంతి మీదికి వచ్చింది, వెనుక కాళ్ళమీద నిలబడి, మంచుబంతి వీపుపైని పడింది.

మలిష్‌కంటె కొంచెం పెద్దవైన యింకో రెండు ఎలుగుపిల్లలు మంచుబంతి మీదికి వచ్చాయి. అవి దానిని ప్రక్కగా త్రోశాయి. తనతో నవి కుస్తీ పట్టదలుచుకున్నాయని మంచుబంతికి అర్థంకాలేదు. అది వీపు మీద పడుకుని దొర్లి బొబ్బలు పెట్టింది. అది కుస్తీ పట్టనూ లేదు, వెనుక కాళ్ళమీద నిలబడనూలేదు. అంచేత గోధుమ వర్ణపు ఎలుగు పిల్లలు ఒకదానితో ఒకటి కుస్తీ పట్టడం మొదలు పెట్టాయి.

మంచుబంతి లేచి, చెరువువేపుకు నడిచింది. అది దూకబోతూ వుండగా, ఫౌంటెన్‌కు ప్రక్కను ఒక ఎర్రని నక్క నక్కి వుంది— ఉరకడానికి సిద్ధంగా వుందా అన్నట్టుగా దాని చెవులు వెనుకకు అంటి వున్నాయి—కనిపించింది. మంచుబంతి తొందరగా తిరోగమించింది.

అకస్మాత్తుగా ఒక పెద్ద అరుపు వినిపించింది. రెండు ఎలుగు పిల్లలు పరుగెత్తాయి, మలిష్ వాటి వెంబడిని పరుగెత్తింది. ఆ పిల్లలు భయపడినట్టుంది, బొద్దుగావున్న వాటి చిన్న తోకలు కంపిస్తున్నాయి.

మంచు బంతి ఆ దొడ్డిలోని కుడివేపు మూలకు వెళ్ళింది, కాని అక్కడ చారలతో వున్న రెండు పులిపిల్లలూ, అన్ని జంతువులలోనూ అతి భయంకరమైన ఒక కుక్క దానికి కనిపించాయి. ఈ కుక్క అరవకుండా, ఎండలో బద్ధకంగా పడివున్నా మంచుబంతి మళ్ళీ తిరోగమించింది. దూరంలో వున్న చుక్చీ ద్వీపకల్పంలో తొలిసారిగా బడి పిల్లవానిని చూడడం, దానికి బాగా జ్ఞాపకం వుంది. అంచేత దానికి కుక్కలంటే అనుమానం.

ఇదంతా సామాన్యమైనదికాదు, గాభరా ఎత్తించే వ్యవహారం. మంచుబంతి కళ్ళు కొంచెం మూసింది, ఎండవల్లనో, భయంవల్లనో. తద్వారా జోడు గుండీలవంటి తన చిన్న కళ్ళను కనిపించీ కనిపించని రెండు పెన్సిలు గీతలుగా చేసుకుంది.

హఠాత్తుగా ఏదో గుండ్రంగానూ, చెమ్మగానూ వున్నది దాని మీద పడి, గుర్రుమంది. మంచుబంతి గెంతింది. అది చూస్తే దాని పక్కను నలుపు—తెలుపు రంగులోవున్న పందిపిల్ల కనిపించింది.

పందిపిల్ల మంచిదానిలాగానే కనిపించింది. మంచుబంతి కుదుటపడింది. క్రొవ్వెక్కి మోటుగావుంది, మెలికలు తిరిగివున్న తోకగలదానిని చూస్తే, యిష్టం కలిగించేదేదో దానికి కనిపించింది కూడా. అది తన మోరను పందిపిల్ల మోటు చర్మంమీద గుచ్చింది. కాని పందిపిల్లకు మంచుబంతి స్నేహం రుచించలేదు. అది యింకో గుర్రు పెట్టి, పులిపిల్లల దగ్గరకు వెళ్ళిపోయింది.

దొడ్డికి యింకో చివరను మంచుబంతికి తెల్లని పీచురేగి వున్న దేదో, చిన్నకర్ర వేదిక దిగువను కనిపించింది. దగ్గరగా వచ్చిచూస్తే అవి రెండు ధృవమండలపు ఎలుగుబంటి పిల్లలు. ఎంత సంతోష కరమైన విషయం! అవి నీడలో నిద్రపోతూ వున్నాయి. మంచు బంతి సంతోష ప్రకటనగా సకిలించి, వేదిక దిగువకు వెళ్ళి ఎలుగు బంటి పిల్లల ప్రక్కను పడుకుంది. అవి కొంచెం జరిగి, యీ నూతన మిత్రుని తమ మధ్యకు ఆహ్వానించాయి.

మంచు బంతి ఒకదాని చెవిని వెతికి, దానిని చప్పరించింది.

(ఇంకా వుంది)



విమానంలో తన ప్రక్కనే కూర్చుని వున్న మనిషి. మిష్కాకు అపరిచిత మైన ఒక కొత్త జంతువు. మిష్కా అతన్ని ఎంతో గాఢంగా విశ్వసించింది




కాన్‌స్తంతిన్ పాస్తొవస్కీ

ప్రేమతో అడిగినా లేక డబ్బిచ్చి కొనుక్కుందామన్నా ఆ పురాతనపు, ఆ అశుభ్రపు వెనీషియన్ హోటల్లో మీకు సిరా దొరకదు. "సిరానా? సిరా, మేమెందుకుంచుతాం ఇక్కడ? వాడుకగా వచ్చే వాళ్ళకు దొంగ బిల్లులు రాసివ్వడానికా?"

అవును, సెర్టోసాలో వుండడానికని హేన్స్ క్రిస్టియన్ యాండర్సన్ వచ్చినప్పుడు సిరాబుడ్డి అట్టడుగున ఒక చుక్కవుంది. గంటలు గడిచేకొద్దీ, ఆయన సిరాబుడ్డిలో నీళ్ల ఎక్కించేకొద్దీ ఆయన రాస్తున్న దేవాతా-కథ వెలవెల బోవడంమొదలు పెట్టింది. అసలు అసాంతానికి రాయడమే విరమించుకొన్నాడు. సుఖాంతం కావలసిన ఆకథ సిరాబుడ్డి అట్టడుగునే కూరుకపోయింది.

తనే తన్నుచూచి చిరునవ్వుకొని, తర్వాత రాయబోయే కథకు శీర్షిక పెట్టాడు "సిరాబుడ్డిలో చిక్కువడ్డ కథ" అని.

హెన్స్ యాండర్సన్ అప్పటికే వెన్నిస్‌ను ప్రేమిస్తున్నాడు. ఆయన దాన్ని "వాడిపోతున్న పద్మం" అన్నాడు,

సముద్రంమీద ఇప్పుడు శరన్మేఘాలు కమ్ముక వస్తున్నాయి. చలనహీనంగా వున్న కాలువల్లోని నీళ్ళు ఇప్పుడు త్రుళ్ళిపడుతున్నాయి. ఏ వీధి మలుపులో నిల్చున్నా నీకు చలిగాలి తుఫానులా వీస్తున్నట్టనిపిస్తుంది. సూర్యోదయం కావడంతోటే, పోతపోసినట్టున్న ఇండ్ల గోడల అడుగున పరచిన చలువరాతి చిత్రవర్ణము వేసిన అంచులు మిలమిల మంటాయి. నీ గది కిటికీలోనుంచి చూస్తే ప్రసిద్ధ వెనీషియన్ చిత్రకారుడు కనలెటో గీసిన ఒక మహత్తర చిత్రంలా కనుపిస్తుంది వెన్నిస్.

అవును, అదో సుందర నగరం, అయితేనేం యెందుకో చిన్నబోయినట్టనిపిస్తుంది. ఇంక ఆయన ఈ నగరాన్ని విడిచిపోవలసిన సమయంకూడా వచ్చింది. ఆయన ఇతర నగరాలను సందర్శించవలసి వుంది.

అందుకనే ఆ హోటల్ పనివాణ్ణి, సాయంత్రం వెరోనాకు పోయే గుర్రబ్బగ్గికి టిక్కెట్టు కొనుక్కురమ్మని పంపించేటప్పుడు అతను అంత విచారించలేదు.

వెన్నిస్ నుంచి గుర్రబ్బగ్గీ బయల్దేరే టప్పుడే చినుకుపడడం ప్రారంభించింది. చిత్తడి చిత్తడిగా వున్న మైదానంలో పోతున్నప్పుడే చీకటి పడుతున్నది.

వెన్నిస్‌నుంచి వెరోనాకు రాత్రిపూట బళ్ళు కట్టించడం, అసలు ఈ ఊహ ఒక్క సైతానుకే తట్టి వుంటుందని ఏదో గొణుక్కుంటున్నాడు బండివాడు.

ప్రయాణీకులు ఎవ్వరూ వాడి సణుగుడు వినిపించుకోలేదు. కాస్త నిశ్శబ్దంగా వున్నాక, వాడు కాండ్రించి వుమ్మేశాడు ఎంతో కోపంతో. లాంతర్లోని ఆ కాస్త తుంపూతప్ప, ఇక వత్తులుకూడా లేవని చెప్పాడు.

దీన్నికూడా ఏ ప్రయాణీకుడూ వ్యాఖ్యానించలేదు. భగవంతుడే పాడుపెట్టిన గోతిలాంటి ఈ వెరోనాకు, అసలు పడవ తెడ్డుతోనైనా మానవీయుడెవ్వడూ ముట్టుకోడానికికూడా సాహసించని ఈ వెరోనాకు, ప్రయాణాలు కట్టేవాళ్ళ బుద్ధిమంతనం గురించి బండివాడు బిగ్గరగా ఆలోచించ సాగాడు.

వెరోనాకు సంబంధించిన అతని ఈ నీచపు అభిప్రాయంతో ప్రయాణీకులు ఎవ్వరూ ఏకీభవించకున్నా, ఎవ్వరూ అతనితో వాదనకు దిగలేదు.

ఆ బండిలో వున్న ప్రయాణీకులు ముగ్గురు—యాండర్సన్, విహ్వల నేత్రుడూ, మధ్య వయస్కుడైన మతాచార్యుడొకడూ; నల్లటి దుస్తులలో వున్న ఒక స్త్రీ.

యాండర్సన్ కంటికి ఆవిడ—కాసేపు వృద్ధురాలిగా, కాసేపు నవ యవ్వనిలా, కాసేపు మహా సుందరంగా, కాసేపటికి మహా వికృతంతా కనుపించసాగింది. మైనపు వత్తి, ఆకాస్త తుంపువెలుగూ ఆవిడ మీద పడుతున్నదాన్నిబట్టి ఇట్లా అతను వివిధంగా ఊహిస్తున్నాడు.

పౌస్తొవస్కీ రచించిన ఈ కథకు వి. యస్. క్లిమషిన్ వేసిన చిత్రం



"దీపం మలిపేస్తే బాగుంటదూ ?"...."ఇప్పుడు అంత అవసరంకూడా లేదు. తర్వాత అవసరంకావచ్చు." అని సూచించాడు యాండర్సన్.

"ఆ ఆలోచనా, అది ఇటలీ దేశస్తుడి పుర్రెకు తట్టనే తట్టదు" అని వ్యాఖ్యానించాడు మతాచార్యుడు.

"ఎందుకని ?"

"ఇటలీ వాళ్ళకు అసలు దూరాలోచనే లేదు. చేతులు కాలిన తర్వాత ఆ కులకోసం వెతుక్కుంటారు."

"గుదువులు బహుశా యీదూరాలోచనలేని జాతికి చెందినవారు కారనుకుంటాను." అన్నాడు యాండర్సన్.

"నేను అస్త్రీయన్ను." సూటిగా మతాచార్యుడు చెప్పిన జవాబుతో ఆ సంభాషణ ముగిసింది.

యాండర్సన్ దీపం ఆర్పేశాడు. కాస్త నిశ్శబ్దంగా వుంది. నల్లదుస్తులు వేసుకున్న ఆవిడ ఇట్లా అన్నది :

"అవును, ఇటలీలోని ఈ ప్రాంతంలో దీపాలు లేకుండా ప్రయాణం చెయ్యడమే తెలివైన పని."

"అయినప్పటికీ ఈ చక్రాల గరగరతో చెవులు చిల్లులు పడుతున్నాయి," "చూడండి, ఆడవాళ్ళెప్పుడూ తోడులేకుండా ప్రయాణాలు చెయ్యకూడదు. ఎవరన్నా ఒక బంధువు వాళ్ళకు తోడుండాలి," అన్నాడు మతా చార్యుడు.

"తోడు లేకేం, నాకు" అని ఆవిడ సంతోషంగా నవ్వుతూ ప్రక్కనే కూర్చునివున్న యాండర్సన్ను చూపింది.

ఆమె మాటకు యాండర్సన్ అభివాద సూచ్యంగా తన టోపీని తీసి ఆడించాడు.

దీపం ఆర్పేశాక, ఆ చీకటిలో తమదే పైచెయ్యి అన్నట్టు చక్రాల సవ్వడి. నిశీథ ధ్వానాలు, రకరకాల వాసనలు ఉవ్వెత్తున కమ్ముక వస్తున్నాయి. వెలుతురు, తమ శత్రువు తిరోగమించడం వాటికో కొత్త ధైర్యాన్ని యిచ్చినట్టుంది. గుర్రాల గిట్టల చప్పుడు, చక్రాల గరగరలు, పెలయేటి రుతాలు, గుర్రబ్బగ్గీ కప్పుమీద పడుతున్న వాన చుక్కల చిటచిటలూ చెవిని పడుతున్నాయి. బండి కిటికీలో నుంచి పచ్చిక బయళ్ళ వాసనా, చిత్తడినేలల వాసనా, ఘాటుగా వస్తున్నది.

"చిత్రంగా వుంది!" అన్నాడు యాండర్సన్ "నేను ఇటలీలో నారింజపండ్ల వాసన ఘాటుగా కొడుతుందనుకున్నాను, అయితే ఇదంతా మా ఉత్తర దేశపు గాలిలాగానే వుంది."

"తొందర్లోనే గాలి మారుతుంది,"..."మనం కొంతమీదుగా పోబోతున్నాం. చల్లగాలి తోలుతుంది ఇంక...." అన్నది ఆవిడ.

గుర్రాలు నింపాదిగా నడుస్తున్నాయి. కాస్త వాళ్ళకు ఇంతలో ఎత్తుమీదికి ఎక్కుతున్నట్టు అనిపించింది.

చీకట్లు ఏమాత్రం విచ్చిపోతున్నట్టు లేదు. రోడ్డుకు యిరుప్రక్కలా తవిసి చెట్లలాంటి చెట్లు, చాచినట్టున్న వాటి కొమ్మల మధ్య చీకటి ఏలుతున్నట్టుంది. చెట్ల ఆకుల మర్మరధ్వానం, చినుకుల చిటచిటలతో ఏదో చీకటి గుసగుసలాడుతున్నట్టుంది.

యాండర్సన్ కిటికీ తలుపు యెత్తి చూచాడు. తవిసి చెట్ల కొమ్మలు అతని ముఖానికి రాసుకు పోయినాయి. ఒక కొమ్మను పట్టుకుని అన్ని ఆకులు దూశాడు.

సచేతనంగా ఊహించగలిగిన వారిలో అనేకమంది కున్నట్టు, అతనికీ రకరకాల చిల్లర వస్తువులు తన ప్రయాణాల స్మృతి చిహ్నాలుగా సేకరించాలనే తృష్ణ తీవ్రంగా వుంది. ఈ స్వల్పవస్తువులు గూడా అతన్ని పరవశం చేసేవి. విగత గతానికి అవి జీవం పోయగలిగేవి, చిత్రవర్ణాలుగల ఒక చలువరాతిముక్కో గాని, ఒక గాడిద నాడాగానీ, లేదా ఒక తవిసి మండేగానీ అది అతనికి లభించినప్పటి క్షణాల ప్రతిస్మృతినీ అతనికి జ్ఞాపకానికి తెస్తుండేవి.

ఇప్పుడూ, ఇదోరాత్రి. యాండర్సన్ ఒక స్నేహితుణ్ణి నమస్కరించినట్టు ఈ రాత్రికి అభివందనం చేశాడు. చీకటే సూర్యకాంతికన్నా ఉల్లాసకరంగా వుంది. రకరకాల సమస్యల్ని పరిశోధించడానికి అది విస్తృతావకాశాన్ని యిచ్చింది. ఈ పరిశీలనవల్ల అలసిపోతే అది అతనికి రకరకాల కథలు కట్టడానికి దోహదం చేస్తుంది, ఆ కథ లన్నిట్లో అతనే ప్రముఖపాత్రగా వుంటాడు కూడా.

ఈ కథ లన్నిట్లో యాండర్సన్ తన్ను తానొక ఉన్నత భావుకుడు, సుందరాంగుడూ ఆయన యువకునిలా, పరవశం చేసే పదాలకు, రసవాదులైన విమర్శకులు తరచు "కవిత్వపు ముత్యాలు" అనే వాటికి యెప్పుడూ తడుముకోని వానిలా రూపించుకొనేవాడు.

నిజానికి, యాండర్సన్కు అతను ఎంతో వికారంగా వుంటాడన్న విషయం బాగా తెలుసు. సన్నగా, సిగ్గుపడుతూ వుంటాడు. దారంకట్టి పిల్లలు ఆడించే కొయ్యబొమ్మ, ముఖ్యంగా వాళ్ళ స్వదేశం డెన్మార్కు బాలలకు అత్యంత ప్రీతిపాత్రమైన ఛేతాళ బొమ్మ కాళ్ళ చేతుల్లా అతని కాళ్ళ చేతులు వ్రేళ్ళాడుతుంటాయని అతనికి బాగా తెలుసును.

ఇట్లాంటి యోగ్యత లున్నాయి కాబట్టి, ఏ స్త్రీ కంటికైనా అతను ప్రసన్నంగా కనుపిస్తాడనే ఆశకూడాలేదు. లాంతరు స్తంభాన్ని చూచినట్టు అతన్ని చూస్తూ వాళ్ళు ప్రక్కప్రక్కగా దాటుక పోయినప్పుడు అతని హృదయం కలుక్కుమనేది.

అతనో కునుకు తీశాడు.

అతనికి మెళకువ వచ్చేటప్పటికి, దిఙ్మండలానికి దిగువన తెలియాడుతున్న పచ్చటి నక్షత్రం కంటబడింది. తెల్లవారబోతున్నది.

బండి నిలిపివేయబడింది. బయట కొన్ని గొంతులు వినిపిస్తున్నాయి.బండివాడు కొందరు ఆడపిల్లలతో కిరాయిబేరమాడుతున్నాడు.

ఒప్పుకోక తప్పదన్నట్లు, కర్ణపేయంగా వున్న ఆ కంఠధ్వనులు, వాళ్ళ బేరమాడడం పురాతనపు సంగీతరూపకంలోని ఒక ఘట్టాన్ని స్ఫురణకు తెచ్చింది.

ఆ చిన్న పట్న ప్రయాణానికి వాళ్ళిస్తామన్న కిరాయి సరిపోదంటూ బండివాడు హఠం వేస్తున్నాడు. ఆ పిల్లలు, వాళ్ళదగ్గరున్న డబ్బంతా పోగుచేశామనీ, అంతకు మించి యింక వాళ్ళదగ్గర డబ్బే లేదనీ వంతపాడినట్టు అదే పదేపదే చెబుతున్నారు.

"చాల్లే వాళ్ళిచ్చేది. అదంత తక్కువైతే, ఆ తక్కువైన డబ్బు నేనిస్తాలే, కాస్త మర్యాదగా మాట్లాడడం నేర్చుకో. నోరు జారితే కష్టం" అని మందలించాడు బండివాణ్ణి యాండర్సన్.

"ఎక్కండి పిల్లల్లారా బండి," అని సణుగుతూ బండివాడు "ఇదిగో! ఇట్లా డబ్బులు విరజిమ్మే యీ విదేశపు యువరాజును ఇక్కడికి పంపిన ఏసుమాత, ఆ మెడోనాకు సాగిలపడి నమస్కరించండి. దీనివల్ల మీరు ఉబ్బిపోకండి; ఆయనకు బండి ఆపడం యిష్టంలేదు. అంతే, మీవల్ల ఆయనకు వొరిగేదేంలేదు; తేనెలో మాగినవైనా నిరుటి జంతికలు ఎంత నిరుపయోగమో అంతే మీరూను.

"భగవతీ! దైవమాతా" అంటూ ఆక్రోశించాడు మతాచార్యుడు.

"నా ప్రక్కనే కూర్చోండి, పిల్లల్లా రా! కాస్త వెచ్చగా

వుంటుంది కూడా," అన్నది ఆ స్త్రీ.

పిల్లలు ఒకరితో ఒకరు మాట్లాడుకుంటూ, సామాను ఒకరి చేతికొకరు అందించుకుంటూ బండెక్కారు. యాండర్సన్‌కు ధన్యవాదాలు చెప్పి చోటుచేసుకొని వాళ్ళు కూర్చున్నాక కాస్తనిశ్శబ్దమైంది.

వాళ్ళ మూటల్లోనుంచి వస్తున్న గొర్రెజున్ను, మిస్తువాసన బండంతా కమ్మేసింది. ఆ పిల్లలు చెవులకు పెట్టుకున్న చౌకబారు లోలాకుల్లో పొదిగిన రాళ్ళ మిలమిలలు అంతచీకట్లోనూ యాండర్సన్ పసిగట్టాడు.

మళ్ళీ బండి బయల్దేరింది. రోడ్డుమీద చక్రాలు గర గర దొర్లుకు పోతున్నాయి. పిల్లలు గుసగుస మాట్లాడటం మొదలు పెట్టారు.

"మీ రెవరో తెలుసుకోవాలని వాళ్ళనుకుంటున్నారు ..."అంది ఆ స్త్రీ. యాండర్సన్, ఆ చీకట్లో ఆవిడ చిరునవ్వుతుండడం కూడా కనిపెట్టాడు. "....మీరు నిజానికో విదేశస్థులైన ఒక యువరాజా లేక సంచారం చేస్తున్న ఒక ఫారెస్టు-రేంజరా?"

"నేనా?—నేనొక ప్రవక్తను" అని తడుముకోకుండా జవాబిచ్చాడు యాండర్సన్. "....నేను భవిష్యత్తు చూడగలను, చీకట్లో కూడా ప్రతిదీ చూడగలుగుతాను. అయితే నేనొక పెద్ద పండితమ్మన్యుని కాకున్నా—కవినిలెండి, ఒకవిధంగా హామ్లెట్ నివసించిన దేశంనుంచి వచ్చిన ఒక పేద రాకుమారుణ్ని."

"అయితే ఈ చీకట్లో మీరు ఏం చూడగలుగుతున్నారు?" అని అడిగింది ఆశ్చర్యంతో ఒక పిల్ల.

"నువ్వా, చెప్పాలంటే సమ్మోహితం చేసే నిన్ను నేను మన సారా ప్రశంసిస్తాను."

అతను మాట్లాడుతున్నప్పుడు, అతనిముఖం అర్ద్రమై, శైత్యం ఆవరించుక పోయింది. దేవతాకథ తట్టినప్పుడల్లా ఇదే విధమైన అనుభూతి సంకేతంలా అతనికి కలుగుతుండేది.

దీనికి చిహ్నాలు ఒకవిధమైన ఆవేదన, ఏదో అజ్ఞాత గర్భంలో నుంచి ప్రవాహంలాగా దూసుకవచ్చే పదాలు. ఒక విధమైన ప్రభుత, కావ్యగతమైన వాక్పాటవం, మానవ హృదయాల్ని చూరగొంటున్న ఒకవిధమైన వశీకరణం, ఒకవిధమైన ప్రభుత.

అతని కథల్లోని ఒక అనుభూతిలాగా వుంది అదంతా అతనికి—పూర్వపు ఖజానా తలుపు, దెబ్బతో తెరుచుకున్నట్టు నిక్షిప్తమైవున్న ఎన్నో అపూర్వ భావాలు, నిద్రాణమైవున్న ఊహలు, పరవశం చేసే భూతల సౌందర్యం అంతా రాశీభూతమై వున్న ఆ అపూర్వ నిధి, దానిలోని వివిధ సుమాలు, రకరకాల వాటి రంగులు, ధ్వనులు, సుమ పరిమళాలు, నీ హృదయాన్ననునయించే తరంగ తురంగ ధ్వానం, అరణ్యారావం, ప్రేమ జ్వాలలు, బాలల విశృంఖల ప్రేలాపన అక్కడ మూర్తిమంత మవుతున్నది.

ఈ స్థితి, యాండర్సన్‌కు అనిర్వచనీయంగా వుంది. కొందరు దాన్ని 'ప్రేరణ' అని అంటే అనొచ్చు. మరికొందరు పరవశత్వం అనొచ్చు. కొందరిది కేవలం కల్పితం అనొచ్చు.

కాస్తాగి, యాండర్సన్ —"రాత్రి నాకు మెళకువ వచ్చేటప్పటికి మీ గొంతులు వినిపించాయి .." "....అది చాలు నాకు మిమ్మల్ని తెలుసుకోను, మిమ్మల్ని నా చెల్లెళ్ళలాగా ప్రేమించగలగను ఇంతకన్న మరేం కావాలి? అవును, నేను మిమ్మల్ని స్పష్టంగా చూడగలుగుతున్నాను. ఇదిగో, నువ్వు మెత్తటి పట్టులాంటి తలకట్టున్న ఓ పిల్లా. నవ్వడం అంటే నీకెంతో ఇష్టంకదూ, జడంకాక సజీవమైన ప్రతిదాన్నీ నువ్వు గాఢంగా ప్రేమిస్తావుకదూ."

"అదంతా నువ్వే అయివుంటావు నికొలీనా" అంది ఇంకొక పిల్ల దూసుక పోతున్న గొంతులో.

"నీహృదయం బహుసున్నితమైనది నికొలీనా. ఎంత మంచి మనసు నీది" అంటూ యాండర్సన్ తొణకకుండా నెమ్మదిగా చెప్పుక పోతున్నాడు...."నీ ప్రియుడికి రవ్వంత నొప్పి కలిగిందా ఎన్నివేల మైళ్ళ దూరం కానీ, మంచు కప్పివున్న కొండలు దాటాలన్నా, నీరు లేని ఎడారులు దాటాలన్నా లెక్క చెయ్యకుండా త్రుటిలో పోతావు అతన్ని రక్షించడానికి. కాదంటావా మరి?"

"బాగుంది, పోక తప్పుతుందా, మీ సమక్షంలో వుండగా కాదనడం...."అంది నికొలీనా చిన్న గొంతులో.

"మీపేర్లు చెప్పారు కాదు" అన్నాడు యాండర్సన్ ఆ పిల్లల్ని ఉద్దేశించి,

"నికొలీనా, మారియా, అన్నా" అని వల్లించినట్టు చెప్పేసింది ఒక పిల్ల.

"మరి, మారియా, నీ సౌందర్యాన్ని గురించి మాట్లాడ్డానికి కాస్త వెనకాడాల్సొస్తున్నది, ఎందుచేతనంటే నాకు ఇటాలియన్ భాష అంత బాగా రాదు. కాగా యవ్వనంలో వున్నప్పుడు కవిత్వాధినాథుని సాన్నిధ్యంలో—సౌందర్యం ఎక్కడ కనుపించినా, దాన్ని నేను విశేషంగా శ్లాఘిస్తానని ప్రతిన చేశాను."

(మిగతా వచ్చేసంచికలో)

## డాన్బాస్ గనులలో ఆరుగంటల-పనిరోజు

(19 వ పుట తరువాయి)

సమయంవరకూ సరిపోతుంది."

తమ పని రోజులో తగ్గింపబడిన రెండుగంటలను గని కార్మికులు ఎలా ఉపయోగించుకుంటారు? చాలామంది గని కార్మికులతో మాటాడి తరువాత, యీ రెండుగంటలూ వారికి ఎంతో ప్రయోజనకరంగా వుంటున్నాయని మేము గుర్తించాము ఉదాహరణకు గనులలో ప్రేలుళ్ళ పనిని చేసే నికొలాయ్ రొగొజ్నికోవ్‌కు యీ రెండు గంటల అవసరపుకాలం, చిత్రలేఖనం, జంత్రి వాద్యాలను వాయించడం, బ్యాండు మేళంలో పాల్గొనడంవంటి అతని అభిమాన విద్యలలో ఎక్కువసేపు పాల్గొనడానికి ఉపకరిస్తోంది.

ఇసక్ బొందర్ యిప్పుడు తన పావురాలతో ఎక్కువసేపు వుండగలుగుతున్నాడు, వాస్తవంగానూ, అలంకార పరంగానూ. ఈ వృద్ధ గని కార్మికునికి 12 మంది పిల్లలూ, యిరవై జతల పావురాలూ వున్నాయి (వేసవిలో యివి యింకా ఎక్కువగా వున్నాయి) బొందర్, అతని చిన్న కపోత అభిమానులు తోల్యా, గ్రిషా ఆరవ ప్రపంచ యువజన విద్యార్థి ఉత్సవం కోసం 300 జతల పావురాలను పెంచడానికి కలలు గంటున్నారు.

అలెక్సీ కర్చెంకోకు యింకో అభిమానవిద్య—ఫోటోగ్రాఫీ—వుంది. పని అయ్యాక, తాను వుంటోన్న ఫ్రాంకో వీధిలో యీ పనిని అయన చేస్తూ వుండడం తరచు కనిపిస్తూ వుంటుంది.

గని కార్మికుల యితర అభిమానవిద్య లన్నిటినీ జాబితా వేయడానికి చాలా కాగితం కావాలి. "ఇతర" అన్న మాటను మేము ఎందు కన్నామంటే, వారి ముఖ్య అభిమాన విద్య "బొగ్గు" కావడంవల్ల.

"అన్ని మంచి విషయాలకూ, బొగ్గు నాంది" అని అంటుంటారు గని కార్మికులు.



# అలమన్-బైగా

## కిర్గీజియాలో గుర్రపు పందేలు

# ★ పండుగ ★

గ్లెబ్ గొలుబేవ్

గుర్రం మీద ఎక్కి ఆడే ఆటలంటే కిర్గిజ్‌లకు యిష్టం. ఇక్కడ అశ్వక్రీడ ఒక ప్రత్యేక స్వభావం గలది. కిర్గిజ్ గుర్రాలు, మేలుజాతి అరబ్ గుర్రాలకూ, ఇంగ్లీషు స్టీప్లర్లకూ పూర్తిగా భిన్నమైనవి. అవి వికారంగా వుంటాయి—పొట్టిగా, చిన్నగా కురచకాళ్ళతో జడలుకట్టిన జూలుతోనూ వుంటాయి. అవి కొంతవరకూ అడవి గుర్రాలు, పోట్లాడతాయి, క్రొత్తవారినెవరినీ తట్టడానికి రానివ్వవు.

ఒకరి తరవాత ఒకరు అశ్వికులు పందెం జరిగే చోటకి వస్తారు. తమ గుర్రాలను చాలా కష్టపడి సముదాయించి, పందెం ప్రారంభమయ్యేచోట తమతమ స్థానాల్లో వుంటారు. రౌతులు కుర్రవాళ్లు, వయోజనాలు కారు.

పిస్తోలు పేలడంతోనే, ప్రజల అభిమాన క్రీడ అయిన 40కిలోమీటర్ల పందెం "అలమన్-బైగా" మొదలవుతుంది. అవి అడుగులువేసే తీరు, మేలుజాతిగుర్రాల తీరుకాదు. అలమన్-బైగా ఓర్మికి సంబంధించిన పోటీ గులాబీ రంగు జుబ్బావేసుకుని వున్న పదమూడేళ్ళ రౌతు చివరిహద్దును మొదట దాటినప్పుడు, ప్రేక్షకులు అడ్డుగావుంచిన వాటిమీద పడిపోయి విజయునికి బహుమతి నివ్వడానికి పరుగెత్తుతారు. ఆ బహుమతి—బ్రతికి వున్న గొర్రె పొట్టేలు.

ఒక చక్కని అమ్మాయి తెల్లని గుర్రం మీద వచ్చేసరికి అందరూ పోటీ జరిగిన స్థలం నుండి తప్పుకుంటారు. వెండి బుటేదారీ పని చేసివున్న ఆకర్షణీయమైన దుస్తులు, నల్ల మొఖమల్ జుబ్బా వేసుకుని వుంది ఆ అమ్మాయి. ఎర్ర నక్కఉన్నితో చేసిన అర్ధచంద్రాకారంలో వున్న చిన్నటోపీ పెట్టుకుంది. ఆమె పొడవాటి జడలు టోపీకి క్రిందుగ కనిపిస్తున్నాయి. ఆ అమ్మాయి సీసపు పిడిగల కమ్చీపట్టుకుంది. దానిని అప్పుడప్పుడు విదలిస్తోంది. ఆమె కొంటెగా చుట్టూ కలయ చూస్తోంది.

తరవాత నా అమ్మాయి యిద్దరు యువకులతో గురుకైన గుర్రాలమీద దౌడుతీస్తూ వెళ్లిపోయింది. ఇది యింకో కిర్గిజ్ జాతీయ వినోదక్రీడ. "క్విజ్-కుమయ్" దీని అర్థం అమ్మాయిని పట్టుకోవడం అని ఆ యువకులు ఆ అమ్మాయిని అందుకుని, ఆ దౌడులో ముద్దు పెట్టుకోవాలి. ఇది సామాన్యమైనది కాదు. ఎందుచేతనంటే ఆ అమ్మాయి కమ్చీతో ఆత్మరక్షణ చేసుకుంటూ వుంటుంది. ఆ యువకులు కొన్ని దెబ్బలు తింటారు. కాని యిద్దరిలో నేర్పుగలవాడు చివరికి తన లక్ష్యాన్ని సాధించుకుంటాడు.



కిర్గిజ్ గుర్రపు పందేల పండుగలో జరుగుతున్న ఒక పందెపు దృశ్యం

# కొలంబో సమావేశం: శాంతి పథంలో ఒక జ్యోతి

బి. లియొంతీవ్

ప్రపంచ శాంతి సమితి సాధారణంగా జరుపుకొనే తన సమావేశాన్ని ఆసియాయొక్క కొత్త రాజ్యాలలో ఒకదాని రాజధానియైన కొలంబోలో జరుపుకొన్నది. కాని దానిని కేవలం "సాధారణ" సమావేశమని అనగలమా? లేము, అదొక ప్రత్యేక సమావేశం, ప్రపంచదేశాల్లో అత్యధిక భాగంయొక్క అత్యంత ప్రాతినిధ్య పూర్వకమూ, అత్యంత ప్రజాస్వామికమూ అయిన ఒక ప్రముఖ సంస్థయొక్క ముఖ్య సమావేశం. ఇప్పుడు ప్రపంచ చరిత్రలో ముందుకువచ్చిన భూభాగంలోని ఒక ఆసియా రాజ్య రాజధానిలో ఈ పర్యాయం ప్రపంచ శాంతి మహాసభ జరగడమే, ఆ సమావేశంయొక్క గొప్ప ప్రాముఖ్యతను వెల్లడి చేస్తుంది. అంతేగాక, సమితి కార్యకలాపాలు అన్ని దేశాల ప్రజల జీవితం యొక్క అత్యంత కఠినదశలో కొనసాగడం మూలంగా, ఈ సమావేశ వేదికపై నుండి చేయబడిన ఉపన్యాసాలు పూర్వం యెన్నడూ లేనంతగా ప్రపంచ జాతులన్నిటి దృష్టిని ఆకర్షించాయి.

ప్రపంచశాంతి సమితి ప్రస్తుత పరిస్థితిని యీ విధంగా విశదీకరించింది: "అపనమ్మకము దేశాలమధ్య సంబంధాలను పాడు చేస్తుంది. మన అణుయుగంలో అది మానవాళిని విధ్వంసపు అంచుల వరకు తీసుకువచ్చింది అంతర్జాతీయ విశ్వాసాన్ని పునరుద్ధరించడము, విశ్వ విధ్వంసనను అరికట్టడము ప్రజల కర్తవ్యము." ఉద్రిక్తతను సడలింప జేయడం సమస్య. అందుకు సంబంధించిన ఇతర విషయాలపైన సమితిచేసిన తీర్మానంలోంచి యీ మాటలు తీసుకొనబడ్డాయి.

తమ కృషి నంతట్నీ శాంతి పరిరక్షణకొరకు వినియోగిస్తున్న డెబ్భై దేశాలకు చెందిన నాలుగువందల మంది అత్యంత ప్రధానమైన సమస్యలను చర్చించడానికీ, యుద్ధాన్ని అరికట్టాలనీ కోరేవారూ, అరికట్టగలవారూ అయిన సుహృద్భావపూరితులైన సామాన్య ప్రజలు చర్య గైకొనడానికి ఒక కార్యక్రమాన్ని తయారుచేయడానికీ కొలంబోకు వచ్చి సమావేశమయ్యారు. కొలంబోలో వారు తమయొక్క బ్రహ్మాండమయిన శక్తినీ, అవకాశాలను గ్రహించుకొన్నారు. దురాక్రమణదారుల పథకాలు వమ్ము గావింపబడగలవని గత సంవత్సరం సూయజ్ కాలువ మండలంలో జరిగిన సంఘటనలు తెలియజేయలేదా? గడిచిన రెండు సంవత్సరాల్లో, బాండుంగ్ మహాసభ సరళి శక్తివంతం కావడము, తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను భద్రం చేసుకోవాలనీ, శాంతియుత సహజీవనం కొరకు పోరాడాలనీ, వలస పెత్తందారులు సామ్రాజ్యవాదులనుండి వాటిని కాపాడడానికీ కృతనిశ్చయులైన ఆసియా ఆఫ్రికా ప్రజల సరళి వ్యక్తం కాలేదా? ఈ రెండు సంవత్సరాలలో శాంతినీ, యూరపు, ఆసియాలలోని సోషలిస్టుదేశాలనూ, విభిన్న ఆర్థిక వ్యవస్థలను కలిగివున్నా, అవికూడా శాంతికొరకూ, శాంతియుత సహజీవనం కొరకూ నిలబడుతున్న ఇతరదేశాలనూ కాపాడుతున్న దేశాల శక్తి అత్యంతంగా అధికం కావడం మనం చూడలేదా? అవును, అలా జరిగింది. ఈనాడు సోవియట్ దేశము, చైనా ప్రజారిపబ్లికూ, పోలెండు, యుగొస్లావియా, భారతదేశం, ఇండోనీషియా, బర్మా, తదితర దేశాలు—తమ వ్యవస్థలు విభిన్నమైన వైనప్పటికి—శాంతికొరకు దృఢంగా నిలబడుతూ, దానిని గట్టిగా రక్షిస్తున్నాయి.

విభిన్న కారణాలమూలంగా, వేరువేరు నెపాలతో, శాంతికి ప్రమాదం కలిగిస్తున్న సైనిక కూటముల నిర్మాణంలో పాల్గొంటున్న దేశాలలోగూడా ప్రజాభిప్రాయం అనుకూలంగా మారుతున్నదని కూడా ఈ సమావేశం తెలియజేసింది. పాకిస్తానీ ప్రభుత్వం ఇద్దరు పాకిస్తాన్ నాయకులు, ఉస్మానీని, అబ్దుల్ కయ్యూమ్ ఖాన్‌ను కొలంబోకు వెళ్ళనివ్వక పోయినప్పటికీ బాగ్దాద్ ఒడంబడిక, 'సియాటో' లలోకి ఈడ్చబడిన పాకిస్తాన్‌లో, ఆ పోలీసు చర్య శాంతి ఉద్యమాన్ని బలహీనపర్చలేదు ఇరాక్‌కూడా బాగ్దాద్ సైనిక కూటమిలో ఒక సభ్యరాలే అయినప్పటికి, ఇరాకీ శాంతియోధుల ప్రతినిధి అయిన షెరీఫ్, తన దేశ ప్రజల తరపున మాట్లాడుతూ, ఈ కూటమి సమీప, మధ్యప్రాచ్య ప్రజలకు దారిద్ర్యాన్నీ, వలస బానిసత్వాన్నీ తెచ్చి పెడుతున్నదని అన్నారు, "సహాయము" అన్నిరకాలైన "పథకాల" ముసుగులో సామ్రాజ్యవాదులు యెన్ని కుతంత్రాలు జరిపినప్పటికి అవి నిజమైన స్వాతంత్ర్యం కొరకు, స్వేచ్ఛ, శాంతులకొరకు పోరాడుతున్న ప్రజలను వారి మార్గంనుండి తప్పించలేవు. సిలోను ప్రతినిధులు లంగరత్న, పెరిరాలు సమావేశంలో చేసిన ఆకర్షవంతమైన ప్రసంగాలు, ఆసియా దేశాల ఇంకా అనేకమంది ప్రతినిధులు చేసిన ప్రసంగాలు, పాశ్చాత్య అగ్రరాజ్యాలు అనబడేవాటి నాయకులు, శాంతి భవిష్యత్తుపైన, మానవాళి భవిష్యత్తుపైన తిరుగులేని ఆధిపత్యాన్ని నేడు కలిగి ఉండలేరని స్పష్టంగా తెలియజేశాయి.

ప్రపంచ శాంతి సమితి చేసిన నిర్ణయాలనుగురించి, విజ్ఞప్తులను గురించి ప్రజలందరు మాట్లాడుకొంటున్నారు. లక్షలాది ప్రజలు వాటితో యేకీభవిస్తున్నారు. వాటన్నిటిలో సమయోచితమైనవీ ముఖ్యమైనవీ అణ్వాయుధ పాటవపరీక్షల విరమణకొరకూ, పాటవ పరీక్షలకు వ్యతిరేకంగా సమిష్టి చర్యకొరకూ చేయబడిన విజ్ఞప్తులు.

"మానవునిలోని పవిత్రమైన ప్రతిదాని పేరిట మేము, యీ పాటవ పరీక్షల తక్షణ విరమణకు చర్య తీసుకొనవలసినదిగా ప్రపంచ ప్రభుత్వాలను కోరుతున్నాము", అని యీ తీర్మానాలలోని మొదటి దాంట్లో ఉన్నది. రెండవ తీర్మానము ప్రజలలోని విస్తృతమైన వర్గాలకు—కొన్ని ప్రభుత్వాలు పై విజ్ఞప్తిని పాటించేటట్టు వీరే చేయగలరు—సంబోధింపబడ్డది. "ప్రపంచ శాంతిసమితి, అణ్వాయుధ పాటవ పరీక్షల ప్రమాదాలను ఆపడానికి కృషిసల్పే ఇతర సమాజాలు, ఉద్యమాలు, సంస్థలు, సంఘాలు, ఇట్లు వ్యక్తులతో తక్షణమే సంబంధాలు స్థాపించుకోడానికి సంసిద్ధంగా ఉన్నది. పద్ధతులు, పనియొక్క మార్గాలు, రూపాలలోనున్న విభేదాలుగాని, అంతర్జాతీయ సంఘటనల అంచనాపైగాని, దృక్పథాలలోగాని విభేదాలు ఉన్నా అవి సార్వజనీనమైన యీ సమస్యా పరిష్కారానికి అడ్డు రాకూడదు," అని ఆ తీర్మానంలో వున్నది.

ఈ విధంగా కొలంబో సమావేశము, శాంతి ఉద్యమ విస్తృతినీ, యుద్ధానిక, అధికాయుధోత్పత్తికీ, దురాక్రమణకు, వలస

(మిగత 37వ పుటలో)

# అపరాధ పరిశోధన శాస్త్రజ్ఞులు

బోరిస్ లైఖోవస్కీ

స్త్రాలరూపంలో కనిపించినట్టుగానే ధి విషయాలుండవు ఎప్పుడూ ఒక సామాన్యమైన ప్రేమలేఖలో రహస్య సందేశం వుండవచ్చును. దువ్వెన, చాకుగా పరిణమించవచ్చును. ఫౌంటెన్ పెన్నులో కాల్చడానికి సిద్ధంగా తుపాకి గుళ్ళు వుండవచ్చును. అందుచేత ఇన్‌స్పెక్టరు, బాహ్యరూపాన్ననుసరించి మాత్రమే పోకూడదు అపరాధ పరిశోధన శాస్త్రజ్ఞుని చేతిలో యివి జరిగిన నేరాలకు మూగసాక్షులుగా, ఎక్స్-రే, ఫోటోగ్రఫీ, స్పెక్ట్రల్ ఎనాలిసిస్, రేడియో ఐసోటోప్స్ మొదలైన అధునాతన విజ్ఞానశాస్త్ర విజయాల ద్వారా ప్రశ్నించటం సాధ్యపడే సాక్షులుగా మారిపోవచ్చును. ఈ విధంగా ప్రశ్నింపబడ్డాక, యీ జడపదార్థాలు ఎప్పుడూ విస్మృతమైపోయిన, గుప్తం చేయబడిన వాటినిగురించి తెలియజెప్పి, దయాదాక్షిణ్యాలు లేని నేరారోపకులుకావచ్చును.

సోవియట్ దేశంలోని అన్నిటికంటె పెద్దదైన వైజ్ఞానిక పరిశోధనా సంస్థఅయిన పౌరసేన యొక్క (మిలీషియా) అపరాధ పరిశోధనా శాస్త్ర సంస్థ అపరాధ అన్వేషణాధికారులకు, సత్యనిరూపణలోనూ, అపరాధులను వెల్లడించడంలోనూ, లేదా నిరపరాధులపైని అనుమానాన్ని తొలగించడంలోనూ సహాయం చేస్తుంది.

ఈ సంస్థకు చెందిన గొప్ప వస్తుజాలంగల పరిశోధనాలయాలలో అనుభవజ్ఞులైన అపరాధ పరిశోధనా శాస్త్రజ్ఞులూ, పదార్థ విజ్ఞాన శాస్త్రజ్ఞులూ, రసాయనిక శాస్త్రజ్ఞులూ, యింకా యితర వృత్తులలోని చాలామంది పని చేస్తారు. ఇందులోని వస్తుసామగ్రి ద్వారా అవి సమగ్రంగా అన్వేషణలను జరపవచ్చును. ఒక్క విషయం కూడా దృష్టిలో పడకుండా తప్పించుకు పోవడానికి వీలులేదు, అతి అప్రముఖమైన వివరం సాధారణంగా తాజా సమాచారాన్నిస్తుంది గాబట్టి,

## కలబంద మొక్క మూగ సాక్ష్యం

నేరం మాస్కోకు సమీపంలో జరిగింది. ఒక లోహష సాధానంలో దొంగలు ఒక దుకాణపు కిటికిని పగలగొట్టి విలువైన వస్తువులను చాలా వాటిని తీసుకపోయారు. కిటికిమీదిగీత ఇన్‌స్పెక్టరు దృష్టినాకర్షించింది. ఏదో ఎండిన మొక్క ముక్కగల ఒక గాడ్ గుడ్డ పేలిక ఆయనకు కనిపించింది.



నేరం జరిగింది, పరిశోధనలో ఏ జాడా దొరకలేదు బహుశా: ఆ ఒక్కటీ తప్ప ..



కిటికీ చట్రం ఏదో లోహపు వస్తువుతో రక్కబడింది
(ఛాయాచిత్రాలు: బి లైఖోవస్కీ)



దువ్వెనలో ఒక కత్తి దాచబడింది

ఈ నేరం జరగడానికి కొద్దిరోజులు ముందర ఆ ప్రాంతంలో నివసించే ఒకతని వేలికి దెబ్బతగిలిందని తరవాత తెలిసింది. స్నేహితు డొకతను యిచ్చిన కలబంద ఆకు దెబ్బతగిలినచోట కట్టబడింది, తరవాత దెబ్బతగిలిన వేలుకు కట్టుకట్టబడింది.

దెబ్బతగిలిన వ్రేలున్న వ్యక్తి దొంగతనంలో పాల్గొని వుంటాడని ఇన్స్‌పెక్టరు ఊహించాడు. అపరాధ పరిశోధన శాస్త్రజ్ఞులు ఆ ఎండు ఆకును సాపుచేసి, గాయంకోసం ఆకును కోసిన కలబంద మొక్కతో సరిపోల్చారు. ఈ కోతలు పూర్తిగా ఒక దానితో ఒకటి సరిపోయివున్నప్పటికీ, యిది కేవలం యాదృచ్ఛికం కావచ్చునని ఊహించబడింది. కాడ నిర్మాణాన్ని, ఆకు లోపలి భాగాన్ని, మొక్కనూ జాగ్రత్తగా పరిశీలన చేశారు. ఎన్నో కలబంద మొక్కలను పరీక్షించాక, నేరం జరిగినచోట గాజ్‌గుడ్డలో కనిపించిన ఆకు అనుమానితుని మిత్రునికిచెందిన కలబంద మొక్కదే నని నిస్సందేహంగా నిరూపింపబడింది.

ఆ తరవాత మాత్రమే అనుమానితుడు బంధింపబడ్డాడు. ఇంతే కాకుండా అతనివద్దను అల్యూమినియం దువ్వెన దొరికింది. ఇది ఇన్స్‌పెక్టర్ అభిప్రాయంలో కిటికీని పగలగొట్టడానికి ఉపయోగింపబడి వుండవచ్చును. కాని యీ వింతకు తుది పరిష్కారమార్గాన్ని చూపినది, ఏ లోహంలోనైనా గల రసాయినిక పదార్థాలనూ, సరిగ్గా వాటి కలయికనూ నిర్ణయించగల స్పెక్ట్రల్ అనాలిసిస్. దువ్వెన స్పెక్ట్రోగ్రాఫ్, కిటికీపైనున్న గీతమీది లోహధూళి ఒకే విధంగా వున్నాయి. దొంగను బట్టబయలు చేస్తూ యిది రెండవ గట్టి రుజువును చూపి, అతను ఒప్పుకునేటట్లుగా చేసింది.

## చూడనిదానినికనిపెట్టవచ్చునా?

ఒక మోటారుకారును దొంగిలించిన తరవాత, దొంగలు దాని రూపాన్ని సాధ్యమైనంతగా మార్చివేయడానికి ప్రయత్నిస్తారు. వారు దానికి తిరిగి రంగువేస్తారు, మోటారు మీద వేయబడిన ఫాక్టరీనంబరును తొలగిస్తారు. రూపుమాసిన నంబరును అది దేనిమీదనైతే వేసివుందో ఆ లోహంతోబాటుగా పూర్తిగా చెక్కివేయబడిన దానిని చదవడం సాధ్యమా?

"అది చేయవచ్చును!" అంటారు అపరాధపరిశోధన శాస్త్రజ్ఞులు. అది చేయవచ్చును. ఎందుచేతనంటే—బలప్రయోగానికి గురి అయిన లోహపు భాగాల కణాలు చాలా లోతుకు చొచ్చుకపోతాయి, అసిడ్‌ను వేసి స్పష్టంగా వాటి జాడను కనుక్కోవచ్చును.

అపరాధ పరిశోధనశాస్త్ర సంస్థ ఉద్యోగులు ఒకసారి, తగలబడిపోయిన తరవాత కాలిన డబ్బును లెక్కించగలిగారు. బూడిక అయిపోయిన బిల్లులను ఒకదాని తరువాత ఒకటిగా వారు లెక్కించారు; ధనాపహరణను కప్పిపుచ్చుకోవడానికి నిప్పుపెట్టాడని అనుమానింపబడిన కాషియర్ పైనున్న అనుమానాన్ని యీ విధముగా తొలగించారు.

ఒక విషయం లోయల్లోకి చొచ్చుకపోవడానికి అపరాధపరిశోధన శాస్త్రజ్ఞులు అవలంబించే పద్ధతులు అద్భుత ఫలితాల నిచ్చాయి. వేయిఏళ్ళ క్రితపు సమాధుల త్రవ్వకాల సమయంలో, కొన్ని గుడ్డ ముక్కలు కనిపించాయి. అవి పరీక్షకోసం అపరాధ పరిశోధన శాస్త్రజ్ఞులకు యివ్వబడ్డాయి.

వారు యీ గుడ్డలు ఉన్నితో చేసినవనీ, అవి గోధుమవర్ణమూ పసుపుపచ్చరంగు వేసివున్నవనీ, ఆ రంగులలో సీసం, రాగి, తగరం వున్నవనీ నిర్ణయించారు. ఒకప్పుడు అక్కడ నివసించిన జాతుల సాంస్కృతిక స్థాయిని నిర్ణయించడానికి వారు అవలంబించే నేత పద్ధతులు ఎటువంటివో కనుగొనడానికి యిది చరిత్రకారులకు తోడ్పడింది.

భారీఎత్తున కృషి జరపడం మాత్రమే కాకుండా, ముఖ్యమైన వైజ్ఞానిక పరిశోధనకూడా జరిపే సోవియట్ అపరాధ పరిశోధన శాస్త్రజ్ఞులు సాధించిన విజయాలు యిటువంటివి. అపరాధ పరిశోధన శాస్త్రసంస్థ, నేరాలను అరికట్టడానికి చేసే కృషిలో చాలా ప్రశస్తమైనవీ, న్యాయపాలనకు చాలా సహాయకరమైనవీ అయిన నూతన అన్వేషణా పద్ధతులను పెంపొందించింది.



# లియో టాల్‌స్టాయ్ చిత్రాలు


## ఎ. షిఫ్‌మన్

*లియో టాల్‌స్టాయ్ వస్తుప్రదర్శనశాల శాస్త్రజ్ఞుడు. మాస్కో.*


మాస్కోలోని టాల్‌స్టాయ్ పత్ర సంచయంలో జాగ్రత్తగా భద్రపరుపబడిన లియో టాల్‌స్టాయ్ వ్రాసిన 160,000 కాగితాలలో, ఆ మహా రచయిత గీసిన బొమ్మలకు ఒక ప్రత్యేకమైన స్థానంవుంది. పెన్సిలుతోగాని కలంతోగాని తొందరలో వ్రాసిన యీ స్కెచెస్, ఏ కారణంవల్ల నయితేనేమి మనకు ఉత్తేజాన్ని కలిగించి, మన ఊహలను పురికొల్పుతాయి.

తనకు చిత్రలేఖనం చాతనవదన్న నమ్మకంవల్ల లియో టాల్‌స్టాయి బొమ్మలు గీయడానికి పెన్సిలు పుచ్చుకున్నది చాలా అరుదు. ఆ కారణంవల్లే ఆయన వ్రాసిన కాగితాలలోనూ, యితర కాగితాలలోనూ కనిపించిన కొద్ది స్కెచెస్, యింకా విలువైనవి.



1



2



3

వీటిలోని పాత చిత్రాలు గత శతాబ్దపు మధ్యకాలంలోనివి. అప్పుడు యువకుడైన ఉద్యోగిగా టాల్‌స్టాయి, కకాసస్‌లో రష్యన్ సేనలతో వున్నారు.




ఇక్కడ ఒక వృద్ధుని బలమైన బొమ్మవుంది (మొదటిచిత్రం). ఆయన సగర్వంగా తల వుంచిన తీరు, మానవ గౌరవంలో నిండిన ఆ కళ్ళు, ఆయన తన విలువ నెరిగినవాడని సూచిస్తాయి. ఆయన ఎవరు? ఉత్తర కకాసస్ పల్లపు భూములలోని ఒక రష్యన్ గ్రామానికి చెందిన ఒక కోసక్కు యీయనని స్పష్టం. లియో టాల్‌స్టాయి యీరకపు మనుష్యులను చాలామందిని చూశారు, వారిని తన అద్భుతమైన కథ "కోసక్కులు" అన్న దానిలో చిత్రించారు.




ఇంకో వృద్ధుని తల యిదుగో (రెండో చిత్రం). ఈయన కళవళికలుకూడా ఎందువల్లనో టాల్‌స్టాయిని ఆకర్షించాయి. ఏమిటి కారణం? "కోసక్కుల"లో ఎరోష్కా మామయ్య చక్కని విగ్రహాన్ని జ్ఞాపకం తెచ్చుతుందాం. చెల్లాచెదరుగా వున్న జుట్టుతోనూ, బొద్దుగా వున్న కనుబొమలతోనూ గల పెద్ద సూక్ష్మదృష్టిగల కళ్లుగల వాడాయన. స్టెప్పీలలోని యీ స్వేచ్ఛాజీవి, కకాసస్ కొండప్రాంతాల కఠిన పురుష సౌందర్యాన్ని మూర్తివంతం గావిస్తున్నాడు. ఈ చిత్రం ఎరోష్కా మామయ్య రూపచిత్ర మనడానికి వీల్లేదనుకొండి. కాని ఆ కథలో వర్ణింపబడిన పాత్రను, కొన్ని విధాలా, యీ వృద్ధుడు సూచిస్తాడనడానికి సందేహించ నక్కరలేదు.




బొచ్చు టోపీ పెట్టుకునివున్న మనిషి (మూడో చిత్రం)యింకో జాతికి చెందిన వ్యక్తి. ఈయన ఉన్నత ప్రదేశాలకు చెందినవాడనీ, కొండలలోని యోధుడనీ చెప్పడానికి సందేహించ నక్కరలేదు. ఆయన ఠీవి, దృఢనిశ్చితాన్ని తెలియజేసే దూరానికి చూసేకళ్ళు—రచయిత యీ విధంగా ఊహించుకున్నారేమో, తన భావి కథానాయకుడైన, ఉన్నత ప్రదేశాల గాథల నాయకుడు హజ్జి మురత్‌ను.

టాల్‌స్టాయి రెండవ చిత్ర సముదాయంలో పదిహేడు చిత్రాలున్నాయి, జూలెస్ వెర్నీ వ్రాసిన "ఎనభై రోజుల్లో ప్రపంచ ప్రదక్షిణ" అన్న రచనకు.

టాల్‌స్టాయి, యీ ఫ్రెంచి గ్రంధకర్తను ఆయన అన్వేషణా బుద్ధికీ, కథ నడపడంలో ఆయనకుగల గొప్ప నేర్పుకూ ప్రశంశించారు. టాల్‌స్టాయ్ ఆయన వీర, ఉదాత్త నాయకులను ప్రేమించారు. పొడవాటి శీతకాలపు సాయంకాలాల్లో ఆయన జూలెస్ వెర్నె పుస్తకాలను, యాస్నయా పోల్యనాలో తన చిన్న బిడ్డలకు చదివి వినిపించేవారు. ఆ నవలలోని వివిధ ఘట్టాలు బాగా అర్థమయ్యేందుకూ, కళ్ళకు కట్టినట్టు తెలిసేందుకూ ఆయన యీ సామాన్యమైన, సరదాపుట్టించే బొమ్మలను గీశారు (4-8 వరకూ చిత్రాలు).

Mes souliers ! s'écria Passepartout




ఈ రచయిత కుమారుడు ఇల్యా టాల్‌స్టాయి, యీ చిత్రాలు ఎలా పుట్టాయో తన స్మృతులలో వ్రాశారు.

"మా బాల్యదశలోని ఆసక్తికరమైన యింకో విషయం,





జూలెస్ వెర్నె. నాన్నగారు యీ పుస్తకాలను మాస్కోనుండి తీసుక వస్తూవుండేవారు; మేము ప్రతి సాయంత్రమూ సమావేశమయ్యే వాళ్ళం, ఆయన మాకు "కెప్టెన్ గ్రాండ్ పిల్లలు", "సముద్రగర్భంలో యిరవై వేల లీగ్‌లు", "చంద్రలోకయాత్ర", "ముగ్గురు రష్యన్లు, ముగ్గురు ఆంగ్లేయులు", యింకా "ఎనభై రోజుల్లో ప్రపంచ ప్రదక్షిణ" చదివి వినిపిస్తూవుండేవారు.

"ఈ ఆఖరు నవలకు బొమ్మలు లేకపోవడం వల్ల, నాన్నగారు తానే బొమ్మలు వేయదల్చుకున్నారు.

"సాయంత్రం చదివేసరికి ప్రతిరోజూ ఆయన పెన్నుతో కొన్ని బొమ్మలను తయారు చేస్తూవుండేవారు. మాకవి యెంతో ఉత్సాహకరంగా వుండడంవల్ల, యితర పుస్తకాలలోని చిత్రాలకంటె అవి మాకు ఎంతో ఎక్కువగా నచ్చేవి."

టాల్‌స్టాయి యొక్క మూడవదీ, ఆఖరుదీ అయిన చిత్ర సముదాయం, గతశతాబ్దపు ఏడవ దశాబ్దానికి చెందినది. అప్పుడాయన ప్రఖ్యాతమైన "ఏ బి సి" వ్రాస్తున్నారు. అప్పుడున్న ఏ బి సి తో సంతృప్తిపడక ఆయన, తాను ఊహించిన సరదాను పుట్టించే కొత్తవాటిని వ్రాస్తున్నారు. వీటిని రష్యా పిల్లలందరూ, "జారుపిల్లలూ, రైతుల పిల్లలూ కూడా" ఉపయోగిస్తారని ఆయన ఆశించారు. ప్రతి అక్షరం తరవాత మనిషినీ, జంతువునూ, లేదా పిల్లలకు తెలిసిన వస్తువునూ చిత్రించే బొమ్మ వుంటుంది (బొమ్మలు 9-10).

ఒక భావాన్ని మాటలలోనే కాకుండా, బొమ్మలలో కూడా వ్యక్త పరచాలన్న వాంఛ, యావజ్జీవితమూ టాల్‌స్టాయ్‌కి వుండేది. 1812లో రష్యా సేనలు ఫ్రెంచి దురాక్రమణదారులపైన పోరాడిన బొరొదినో యుద్ధరంగాన్ని చిత్రించిన ఆయన పెన్సిల్ స్కెచెస్, "యుద్ధమూ, శాంతి" చదివిన వారికి పరిచయమైనవే. తాను నవలను వ్రాస్తున్నప్పుడు, ఆ చారిత్రిక ప్రదేశానికి వెళ్ళాక ఆయన వాటిని చిత్రించారు.

టాల్‌స్టాయ్‌కి చిత్రలేఖనం బాగారాదు. పద చిత్రణలో ఆయన ప్రతిభవ్యక్తమయ్యింది. అయినా ఆయన చిత్రాలు మనకు ప్రియమైనవి. ఒకవిధంగా అవి, యీ మహా రచయితపట్ల మనకుగల అభిప్రాయానికి పరిపుష్టిని చేకూర్చుతాయి.

## 30 సంవత్సరాల క్రితం

(18వ పుట తరువాయి)

శాస్త్రవేత్త సర్ చంద్రశేఖర వెంకటరామన్ లేచి యిలా అన్నారు: "కాల ప్రభావాన్ని ఎవ్వరూ ఆపలేరు. స్వేచ్ఛాయుగం సాగిపోతోంది. యీ యుగంలో విజ్ఞానంకూడా స్వేచ్ఛను పొందుతుంది......" చుట్టూరా మూగిన శ్రోతలు ఆయన ఉపన్యాసం మధ్య తరచుగా పెద్ద హర్షధ్వానాలు చేశారు.

తమ విరామ సమయంలో భారతీయ అతిథులు లెనిన్ గ్రాడ్ లోని వైజ్ఞానిక సంస్థలకూ, పరిశ్రమలకూ వెళ్ళారు; లెనిన్ గ్రాడ్ కార్యనిర్వాహక సంఘం, నగర సోవియట్ల సమావేశాలకు వెళ్లారు.

తాను మాస్కోకు వచ్చిననాడు శ్రీ మోడీ ఆ నగరవాసులను అభినందించారు. దీనిప్రతి "వెచెర్న్యాయా మాస్క్వా" అన్న వార్తా పత్రికలో ప్రచురింపబడింది. "సోవియట్ దేశపు ముఖ్య నగరమైన మాస్కోకు రావడం నాకు సంతోషకరమైన విషయం. భారతీయ ప్రజల, సోవియట్ ప్రజల స్నేహాభివృద్ధి సాగగలదని ఆశిస్తున్నాను" అని ఆయన వ్రాశారు.

మాస్కో సోవియట్ గౌరవసభలో వందలాదిమంది మాస్కో పురవాసులూ, విదేశీ అతిథులూ సమావేశమయ్యారు. సర్ సి. వి రామన్ ప్రసంగించారు. యావత్తు ప్రపంచంలోని పండితుల సహవాసం, యీ ప్రపంచంలోని సకల ప్రజల మధ్య యిదేవిధమైన సహవాసానికి దారితీయగలదన్న ఆశను ఆయన ప్రకటించారు.

తన మనఃపూర్వకమైన ప్రసంగాన్ని ముగిస్తూ ఈ భారతీయ అతిథి యిలా చెప్పారు: "ఇదే నిజమైనట్టయితే, ప్రథమంగా యీ అంతర్జాతీయ ఐకమత్యాన్ని ప్రారంభించిన విజ్ఞాన శాస్త్రపరిషత్తుకూ, ప్రభుత్వానికీ, ప్రజలకూ కృతజ్ఞత, గాఢమైన కృతజ్ఞత."

సోవియట్ దేశ పర్యటన సమయంలో ప్రొఫెసర్లు మోడీ, రామన్, కున్ పైని ప్రజల దృష్టి కేంద్రీకరింపబడి వుండేది. వారి చిత్రాలు కేంద్ర మాస్కో, లెనిన్‌గ్రాడ్ వార్తా పత్రికలలో ప్రచురింపబడుతూ వుండేవి వారితో ఇంటర్వ్యూలు తరచు వెలువడుతూ వుండేవి....

ఈ భారతీయ అతిథులు జార్జియాకూ, అజర్‌బైజాన్‌కూ కూడా వెళ్లారు.

భారతీయ పండితులు సోవియట్ దేశానికి రావడం అదే తొలి సారి. అప్పటికి యిప్పటికీ ముప్ఫయ్యేళ్ళకు పైగా కాలం గడిచి పోయింది. 1920 తొలి ఏళ్ళలో స్థాపింపబడిన భారతీయ-సోవియట్ సాంస్కృతిక సంబంధాలు యిప్పుడు బ్రహ్మాండంగా వృద్ధి చెందాయి. కాని యీ స్నేహపు తొలి అడుగులను మనం మర్చిపోలేదు, అది ఎలా ఉదయించిందో విస్మరించలేదు....

## నొవొసిబిర్స్క్ జల విద్యుత్కేంద్రం

(17వ పుట తరువాయి)

యాంత్రీకీకరణ అభివృద్ధితో, నిర్మాణకాలాన్నీ, దాని వ్యయాన్ని ఎక్కువగా తగ్గించడానికి యిదంతా తోడ్పడుతుంది.

ఎత్తుగా వున్న ఓబ్‌నది ఎడమ ఒడ్డుమీద, నిర్మాతల కొరకు ఒక చిన్ననగరం వుంది. జల విద్యుత్కేంద్ర నిర్మాణ కాలంలో నిర్మింపబడిన సదుపాయమైన ఒకటి రెండంతస్తుల యిళ్లు, నిర్మాత లందరికీ గృహ వసతులను కల్పిస్తున్నాయి. ఈ చిన్న నగరం నిర్మాణస్థలానికి చేరువగావుంది; దానికి సదుపాయాలన్నీ—షాపులూ, భోజనశాలలూ. పాఠశాలలూ, ఆసుపత్రి, పోలీ క్లినిక్ వున్నాయి.

అక్టోబరు విప్లవం 40వ వార్షికోత్సవం నరికి యీ కేంద్రపు రెండు యూనిట్ల నిర్మాణాన్ని పూర్తి చేస్తామని నిర్మాతలు ప్రతిజ్ఞ చేశారు. ఈ ప్రతిజ్ఞను వారు నిలుపుకుంటారు.

## కొలొంబో సమావేశం : శాంతిపథంలో ఒక జ్యోతి

(31వ పుట తరువాయి)

పెత్తందారీ విధానానికీ వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటం యొక్క యావత్తు సంఘటన విస్తృతినీ తెలియజేస్తుంది. ఈ సమిష్టి ఆదర్శ సాధనకొరకు ప్రజాశక్తులన్నీ ఒక్కచోట కూడినట్లయితే శాంతి ఉద్యమం మరింత శక్తివంతమై, అభేద్యమవుతుంది. ప్రజల ఆశయం నెరవేర్చబడాలి.

భూమండలంలోని అన్ని ప్రాంతాలలోని పరిస్థితికి సంబంధించిన సమస్యలను అతి జాగ్రత్తగా పరిశీలించడంలోకూడా విస్పష్టంగా కొలంబో సమావేశం యొక్క చారిత్రక విశిష్టత ఉన్నది. దౌర్జన్యపూరిత అట్లాంటిక్ కూటమి సృష్టి మూలాన రెండు శిబిరాలుగా కృత్రిమంగా విడిపోయినయూరపు సుస్థిర శాంతి కొరకూ, అన్నిదేశాల మధ్య సహకారం, సమిష్టి భద్రతల కొరకు తహతహలాడుతున్నది. సోవియట్ దేశం దీనినే పదేపదే కోరుతూ వచ్చింది. ఆసియా వలస పెత్తందారులు, వారి సైన్యాలు, మిలిటరీ మిషన్‌లు సంపూర్ణంగా ఉపసంహరించుకోవాలనీ, తైవాన్‌లో అమెరికా దురాక్రమణ అంతరించాలనీ, మహా చైనా ప్రజా రిపబ్లిక్ యొక్క హక్కులు గుర్తింపబడాలనీ, కొరియా, వియత్‌నామ్‌లు శాంతియుతంగా పునరైక్యం గావింపబడాలనీ కోరుతుంది కొలంబో సమావేశం తీర్మానాలలో ఈ విషయాలన్నీ ఉద్ఘాటింపబడ్డాయి. నిర్దాక్షిణ్యంగా ప్రజా ఉద్యమం అణిచివేయబడుతున్న ఆఫ్రికా, లాటిన్ అమెరికాలు నిజమైన స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను డిమాండు చేస్తున్నాయి. శాంతి అవిభాజ్యమయినది, అన్ని ఖండాలలో అది విజయం పొందాలి.

# ఐక్యత, సంఘీభావం

## సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ అధ్యక్షవర్గంలో పార్టీ వ్యతిరేక బృందంపై వ్యాఖ్యలు

జి. ఎం. మాలెంకోవ్, యల్. యం. కగనోవిచ్, వి. యం. మోలటోవ్ పార్టీ వ్యతిరేక బృందం గురించి సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశ తీర్మానం*, సోవియట్ దేశ మంతటా, విదేశాలలోనూ బ్రహ్మాండమైన రాజకీయ సంచలనాన్ని రేకెత్తించింది.

20వ పార్టీ మహాసభ నిర్ణయాల ప్రాతిపదికపైని పార్టీ కేంద్ర కమిటీ అనుసరించే దేశాంగ, విదేశాంగ విధానమూ, అంతర్జాతీయ ఉద్రిక్త పరిస్థితిలో ఉపశమనాన్ని తీసుకరావడానికి సోవియట్ ప్రభుత్వ కృషి సోవియట్ ప్రజలచే ఎంత ఏకగ్రీవంగా, దృఢంగా బలపర్చబడుతున్నాయంటే, తమ పార్టీ-వ్యతిరేక రాజకీయ వేదికతో పార్టీ సాధారణ విధానాన్ని ఎదిరించడానికి యీ ముఠాకట్టిన బృందం చేసిన ప్రయత్నాలు పార్టీలో అంతటా కోపాన్ని, తీవ్ర ఖండననూ రేకెత్తించాయి.

మాస్కో, లెనిన్‌గ్రాడ్, కీవ్, మిన్‌స్క్, టిబిలిసి మొదలైన నగరాలలో జరిగిన పార్టీ సంఘాల సమావేశాలు, ప్లీనరీ సభ తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించాయి. దేశాన్ని ఆర్థికంగా యింకా అభివృద్ధి గావించేందుకు, అంతర్జాతీయ ఉద్రిక్తతను ఉపశమింపజేసేందుకు ఉద్దేశింపబడిన చర్యలన్నిటినీ తాము పూర్తిగా బలపర్చుతామని, అవి పార్టీ లెనినిస్టు నాయకత్వానికి హామీనిచ్చాయి.

కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశ తీర్మానమూ, స్థానిక పార్టీ సంఘాల చాలా తీర్మానాలూ పార్టీయొక్క అఖండ ఐక్యతనూ, సంఘీభావాన్నీ అత్యంత స్పష్టంగా చూపుతాయి. కేంద్రకమిటీ నాయకత్వాన, సోవియట్ ప్రజలందరి తోడ్పాటుతో, సోవియట్ దేశంలోని దెబ్బైలక్షల కమ్యూనిస్టులు, ప్రపంచ శాంతి పటిష్టతకు ఎంతో ముఖ్యమైన 20వ పార్టీ మహాసభ నిర్ణయాలన్నిటినీ అమలు జరపడానికి కృతనిశ్చయులయ్యారు.

ప్రజలతో సంబంధాన్ని పూర్తిగా పోగొట్టుకున్న, ప్రజల మూల ఆశయాలకు భిన్నమైన, గత కొద్ది ఏళ్ళలో యీ దేశంలోనూ ప్రపంచ మంతటా జరిగిన మార్పులను గుర్తించని పార్టీ-వ్యతిరేక బృందం, సోవియట్ దేశానికీ యితర దేశాల ప్రజలకూ మధ్య స్నేహపూర్వక సహకారం ఆచరణలో అమలు జరగకుండా నిరోధించడానికి ప్రయత్నించింది. విభిన్న సాంఘిక వ్యవస్థలుగల దేశాల మధ్య లెనినిస్టు శాంతియుత సహజీవన సూత్రాలను పార్టీచే త్యజింపజేయడానికి అది ప్రయత్నించింది.

సోవియట్ దేశ నాయకులకూ, యితర దేశాల రాజకీయ వేత్తలకూ మధ్య వ్యక్తిగత సంబంధాలు, పరస్పర అవగాహనను, మంచి అంతర్జాతీయ సంబంధాలను సాధించడానికి ఎంతో అవసరమైన సంబంధాలు అభివృద్ధి చెందకుండా నిరోధించేందుకు, యీపార్టీ వ్యతిరేక బృందం ప్రయత్నించింది.

* ఈ సంచిక అనుబంధం చూడండి.

మాలెంకోవ్, కగనోవిచ్, మోలటోవ్, వారితో కలసిన షెపిలోవ్ దేశాంగ విధానాన్ని కూడా పాత పద్ధతులకు మళ్ళించడానికి ప్రయత్నించారు, ముఖ్యంగా పారిశ్రామిక నిర్వహణ పునర్నిర్మాణాన్ని వారు వ్యతిరేకించారు, యీ కొత్త పద్ధతిని ప్రజలందరూ సూచించి, ఆమోదించినప్పటికీ. వారు బీళ్లు, బంజర్లు అభివృద్ధి పరచవలసిన అవసరం లేదన్నారు, సమిష్టి క్షేత్ర రైతాంగ సంక్షేమాన్ని యింకా బాగుపర్చడానికి తీసుకోబడిన చర్యలను వ్యతిరేకించారు.

జులై 4న సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ, సోవియట్ దేశ మంత్రివర్గమూ, తమ వ్యక్తిగతమైన మడులనుండి సమిష్టి రైతులు, ఫాక్టరీ, కార్యాలయోద్యోగులూ పంటను విధిగా యివ్వాలన్నదానికి 1958 జనవరి 1 నుండి రద్దుచేస్తూ ఒక నిర్ణయం చేశాయి. లక్షలాదిమంది ప్రజలకు ఎంతో ముఖ్యమైన కాలోచితమైన యీ చర్యకు, పార్టీ వ్యతిరేక బృంద సభ్యులు అసమ్మతి తెలిపారు.

వ్యావసాయిక, పారిశ్రామికాభివృద్ధిలో పార్టీ సాధించిన నిరాకరించడానికి వీలులేని విజయాలను అపఖ్యాతిపాలు చేసేందుకు, పార్టీ వ్యతిరేక బృందం తన శక్తిని వినియోగించింది. ఏదోఒక లోపాన్ని పెద్దదిగాచేసి చూపి, వారు పార్టీ విధానాన్ని అపఖ్యాతిపాలు చేయడానికి ప్రయత్నించారు. స్టేట్ కంట్రోల్ మంత్రిగా మోలటోవ్ పారిశ్రామిక నిర్వహణ పునర్నిర్మాణానికి చేయబడిన నిర్ణయాల అమలును సులభసాధ్యం చేసేందుకు ఏమీ చేయలేదు: ఆయన చేసిందల్లా యీ నిర్ణయాలకు వ్యతిరేకంగా ఉత్తరాలు వ్రాయడం.

కాబట్టి యీ పార్టీ-వ్యతిరేక బృందం రాజకీయ వేదిక 20వ పార్టీ మహాసభ నిర్ణయాలకు వ్యతిరేకంగా ఉద్దేశింపబడితే, యీ బృందంలోని కృషి యీ నిర్ణయాలను భగ్నం గావించడానికి ఉద్దేశించబడింది.

పార్టీ-వ్యతిరేక బృందాన్ని బట్టబయలు చేయడం వల్ల సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ ఐక్యత యింకా సుసంఘటితం కావడమూ, సోవియట్ గణంలో నూతనార్థికాభ్యుదయమూ, అంతర్జాతీయ రంగంలో సోషలిజం, శాంతి శక్తులు సుసంఘటితం కావడమూ సులభమవుతుంది.

కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశ తీర్మానంపైని వచ్చిన తొలి అంతర్జాతీయ వ్యాఖ్యలు, అంతర్జాతీయ ఉద్రిక్తతను యింకా ఉపశమింపజేయడానికి యిది అనుకూలమైనదానిగా పరిగణింపబడిందని తెలియజేస్తున్నాయి. పోలిష్ వార్తా పత్రిక త్రిబునలుదు మాలెంకోవ్, కగనోవిచ్, మోలటోవ్‌ల బృందం బట్టబయలు చేయబడడాన్ని హర్షించింది. మూఢ విశ్వాసులపైని, ఛాందసులపైని పార్టీలోని నిర్మాణాత్మక శక్తులకు యిది విజయమని, యీ పత్రిక అభిప్రాయ పడింది.

యుగోస్లావ్ వార్తాసంస్థ టాన్‌జుగ్ పార్టీ శ్రేణులు యింకా సుసంఘటితం కావడానికి, యీ తీర్మానం తోడ్పడుతుందని వ్రాసింది.

ఈ వార్తాసంస్థ అభిప్రాయంలో, సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ సోవియట్ ప్రజల ప్రగాఢమైన భావాలను వ్యక్తపరుస్తుందని యీ తీర్మానం తెలియజేస్తుంది.

మాలెంకోవ్, కగనోవిచ్, మోలటోవ్ బృందాన్ని కేంద్రకమిటీ నుండి నిష్క్రమింపజేసినందువల్ల సోవియట్ దేశానికీ పాశ్చాత్య దేశాలకూ మధ్య సామరస్యానికి క్రొత్త చర్యలు తీసుకునేందుకు అవకాశం కలగిస్తుందని ఫ్రాన్స్-ప్రెస్ వార్తాసంస్థ విశ్వసిస్తోంది.

లండన్ పత్రికలు యీ తీర్మానాన్ని, మోలటోవ్ ఆయన సహచరుల నిష్క్రమణ అంశాలపైని అంతర్జాతీయ సమస్యల పట్ల మృదువైన దృక్పథానికి విజయంగా పరిగణిస్తున్నాయి.

టోకియోలో విదేశాంగ వ్యవహారాల మంత్రిత్వశాఖ ప్రతినిధి ఒకరు, అంతర్జాతీయ ఉద్రిక్తతా ఉపశమనానికి దృఢంగా కృషి చేసేందుకు సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ, సోవియట్ ప్రభుత్వాల దీక్షకు ప్రతిబింబంగా యీ తీర్మానాన్ని వర్ణించారు.

పశ్చిమ దేశాలలోని అభివృద్ధి నిరోధక శక్తులు మాత్రమే, "బలాధిక్యతా స్థానాల"నూ, ప్రచ్ఛన్న యుద్ధ విధానాలనూ పట్టుకు వ్రేలాడేవారు మాత్రమే, సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ శ్రేణుల ఐక్యత సుసంఘటితం కావడాన్నీ, దాని నాయకత్వ అఖండ ఐక్యతనూ వ్యతిరేకిస్తున్నారు. కొందరు పాశ్చాత్య "ప్రవీణులు" "క్లిష్ట పరిస్థితులను, క్రెమ్లిన్లో విభేదాలను" ఆశించారు. ఈ ఆశలు ఎన్నడూ సఫలంకావు;

సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ బలం, దాని శ్రేణుల ఐక్యతలోనూ, సోవియట్ దేశంలోని శ్రామిక ప్రజలంతా దాని విధానాన్ని బలపర్చడంలోనూ, దాని దృఢమైన అంతర్జాతీయ సంబంధాలలోనూ ఎప్పుడూ వుంటుంటోంది. నేడు శాంతికాముక అభ్యుదయకర మానవజాతి అంతా సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశం తీర్మానాన్ని, ప్రపంచంలోని సకలదేశాల మధ్య అధికతర స్నేహ సహకారాలను పెంపొందించే ఒక ముఖ్యమైన నూతన బాధ్యతగా ఆహ్వానిస్తోంది.

## సోవియట్ దేశంలో నేను చూచిన క్రొత్త విషయాలు

[2వ పేజి తరువాయి]

విజ్ఞానశాస్త్రం అత్యున్నతమైన మానవ విలువలను సృష్టిస్తుంది. వైజ్ఞానిక సంస్కృతి పశ్చిమదేశాల, పాతప్రపంచానికి సంబంధించిన ప్రస్తుత విజ్ఞానేతర సంస్కృతుల స్థానాన్ని ఆక్రమించుకున్నట్లయితే, మానవుడు అత్యంత స్నేహపూర్వకమైన జీవితాన్ని జీవిస్తాడు, సహాయకరమైన సహకార వాతావరణంలో బ్రతుకుతాడు. యుద్ధాలోచనలు సైతం గతకాలపు విషయాలై పోతాయి. మానవ నష్టానికి ఉపయోగింపబడే అవకాశంగల పరమాణు, ఉదజని ఆయుధాల రూపంలో, విజ్ఞానశాస్త్రం మానవజాతికి ఉపద్రవాన్ని తెస్తుందన్న సాధారణ విశ్వాసానికి ఆధారంలేదు. ఈ విషయంలోని సత్యమేమిటంటే, విజ్ఞానశాస్త్రం గొప్ప సంగతులను పరమాణు ఆయుధంతో బాటుగా కనుగొంటుంది; కాని చాలా సంఖ్యలోగల, అధికారంగలిగి ప్రభుత్వాల నేర్పరిచే విజ్ఞాన శాస్త్రజ్ఞులు కానివారిచే యివి మానవునికి కీడు చేయడానికి ఉపయోగింప బడుతున్నాయి. ఈ ప్రతిష్ఠంభననుండి బయటపడడానికి ఏకైకమార్గం, వైజ్ఞానిక భావనను విశ్వజనీనం చేయడమే. మంచి వైజ్ఞానిక శిక్షణ, ప్రధానావశ్యకం కావలసివుంది. గ్రంధకర్తలు, కళాకారులు, రాజకీయవేత్తలు, ఉద్యోగులూ, ప్రభుత్వ సభ్యులు భవిష్యత్తులో మంచి విజ్ఞానులు కావలసి వుంది.

—(క్లుప్తీకరింపబడింది. "సోవియట్ భూమి" ఆంగ్లప్రతిలో పూర్తి పాఠం వుంది.)

ఇంగ్లీష్, ఉర్దూ, బెంగాలీ భాషలలో

# మాస్కో రేడియో ప్రసార కార్యక్రమాలు

### ఇంగ్లీషులో

| | | |
|---|---|---|
| 14.00—14.15 | భారతీయ కాలమానం | 13—16—19—25 మీ. బ్యాం. |
| 16.30—17.15 | భారతీయ కాలమానం | 13—16—19—25 మీ. బ్యాం. |
| 20.15—20.45 | భారతీయ కాలమానం | 13—16—19—25 మీ. బ్యాం. |

### హిందీలో

| | | |
|---|---|---|
| 14.15—14.30 | భారతీయ కాలమానం | 13—16—19—25 మీ. బ్యాం. |
| 18.30—18.45 | భారతీయ కాలమానం | 16—19 మీ. బ్యాం. |
| 21.15—22.00 | భారతీయ కాలమానం | 13—16—19 మీ. బ్యాం. |

### ఉర్దూలో

| | | |
|---|---|---|
| 14.45—15.00 | భారతీయ కాలమానం | |
| 14.15—14.3C | పశ్చిమ పాకిస్తాన్ కాలమానం | 13—16—19—25 మీ. బ్యాం. |
| 19.30—20.15 | భారతీయ కాలమానం | |
| 19.00—19.45 | పశ్చిమ పాకిస్తాన్ కాలమానం | 13—16—19 మీ. బ్యాం. |

### బెంగాలీలో

| | | |
|---|---|---|
| 14.30—14.45 | భారతీయ కాలమానం | |
| 15.00—15.15 | తూర్పు పాకిస్తాన్ కాలమానం | 13—16—19—25 మీ. బ్యాం. |
| 18.45—19.30 | భారతీయ కాలమానం | |
| 19.15—20 00 | తూర్పు పాకిస్తాన్ కాలమానం | 16—19 మీ. బ్యాం. |
| 21.00—21.15 | భారతీయ కాలమానం | |
| 21 30—21.45 | తూర్పు పాకిస్తాన్ కాలమానం | 13—16—19 మీ. బ్యాం. |

మాస్కో రేడియో ప్రసార కార్యక్రమాలు రోజూవుంటాయి. ఈ మాకార్యక్రమాల్లో సోవియట్ దేశం, ఇతరదేశాల జీవిత విశేషాలు; సోవియట్ జీవితం, ప్రపంచ రాజకీయాలమీద ప్రసంగాలు, వ్యాఖ్యలు; సోవియట్ పత్రిక, పుస్తకసమీక్షలు వినవచ్చు. మాస్కో రేడియో ప్రసారాల్లో శాంతి అంతర్జాతీయ సహకారాల బలపర్చటానికి ఉద్దేశించబడిన సోవియట్ ప్రభుత్వ విధానాలు వివరించబడ్తాయి. ఈ కార్యక్రమాల్లో మరో యుద్ధభయాన్ని వారిస్తూ శాంతి కాముకులు ప్రతిచోటా చేస్తున్న ప్రయత్నాలుకూడా వివరించబడ్తాయి

రోజూ, సంగీత కార్యక్రమ ప్రసారాలుకూడా వుంటాయి. "సోవియట్ సాప్తాహిక కార్యక్రమంలో" సోవియట్ దేశంలో వారంలో జరిగిన ప్రముఖ విషయాల యథాతథంగా వివేదించే రికార్డింగులు వుంటాయి. ఈ సాప్తాహిక కార్యక్రమాలు, హిందీ, బెంగాలీ, ఇంగ్లీషు భాషలలో సోమవారాలలోను, ఉర్దూ భాషలలో శనివారాలలోను ప్రసారం చేయబడ్తాయి.

సామ్యవాద దేశాలకు సంబంధించిన ప్రత్యేక కార్యక్రమాలను, గురువాలలో ఉర్దూలో, శుక్రవారాలలో బెంగాలీ, హిందీ, ఇంగ్లీషులలో మాస్కో రేడియో ప్రసారం చేస్తుంది.

సోవియట్ దేశంలోనూ, విదేశాలలోనూ సోవియట్ క్రీడాకారులు సాధించిన విజయాలను వివరించే క్రీడాసమీక్ష శుక్రవారాలలో ఇంగ్లీషులో ప్రసారమవుతుంది.

ఉర్దూలో, బెంగాలీలో మంగళ వారాలలోను, ఇంగ్లీషులో బుధవారాలలోను, హిందీలో గురువారాలలోను పిల్లలకు ప్రత్యేక కార్యక్రమా లుంటాయి.

యువజనులకు ఉర్దూలో సోమవారాలలో, హిందీలో బుధవారాలలో, బెంగాలీలో, ఇంగ్లీషులో గురువారాలలో ప్రత్యేక కార్యక్రమా లుంటాయి

శనివారాలలో ఇంగ్లీషు, బెంగాలీలలో మాస్కో మెయిల్ బ్యాగ్ కార్యక్రమంలో శ్రోతల ప్రశ్నలకు మా జబాబులు యివ్వబడ్తాయి. శ్రోతలకోరిక ననుసరించి రికార్డులు పెట్టబడ్తాయి. శ్రోతల ప్రశ్నలకు మా జబాబులు—హిందీలో మంగళవారాలలో, ఉర్దూలో శుక్రవారాలలో వినవచ్చును.

ఆదివారాలలో అన్ని భాషలలోను సాహిత్య కార్యక్రమా లుంటాయి. వీటిద్వారా శ్రోతలకు రష్యన్ గ్రంధాలు, ఆధునిక సోవియట్ రచనలు, విదేశరచయితల పరిచయం చేయబడుతుంది.

మంగళవారాలలో ఇంగ్లీషులో సంగీత కార్యక్రమం, శనివారాలలో హిందీలో ప్రత్యేకంగా భారతీయ సంగీత కార్యక్రమం ప్రసారం చేస్తాము.

బెంగాలీ, ఉర్దూలలో బుధవారాలలో ఒక వారం విడిచి ఒకవారం సోవియట్ విజ్ఞానశాస్త్రం ఇంజనీరింగులలో సాధించిన విజయాలకు సంబంధించిన కార్యక్రమం వుంటుంది.

*శ్రోతల వ్యాఖ్యలు, సలహాలు సంగీత కార్యక్రమాలకు సంబంధించిన అభ్యర్థనలు-రేడియో కేంద్రం, మాస్కో యు ఎస్ ఎస్ ఆర్ కు గాని; సోవియట్ రాయబార సమాచారశాఖ, 25 బారాకంబా రోడ్డు పోస్టుబాక్సు నెంబరు 241, న్యూ ఢిల్లీకి గాని పంపవలెను.*

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖ తరఫున, జి. ఎఫిమోవ్ చే 25, బారాకంబా రోడ్, న్యూ ఢిల్లీ నుండి సంపాదితము, ముద్రితము, ప్రచురితము. ముద్రాపకులు పంజాబి ప్రెస్, సదర్ బజార్, న్యూ ఢిల్లీ.

# జనరల్ స్పైడెల్ కలగంటున్నదేమిటి?



శిథిలీకృతమైన ప్యారిస్, ప్రసిద్ధమైన ఈఫెల్ గోపురం ఉరికంబంగా మారడం—అవి, జనరల్ స్పైడెల్ కలగంటున్నది. ఉక్రేనియన్ చిత్రకారుడు ఆర్. మా తు సే వి చ్ వాటిని ఊహించి చిత్రీకరించాడు.

ఎవరీ సేనాని? విధ్వంసమైన ఫ్రెంచి ముఖ్యపట్టణాన్ని గురించి యెందుకాయన కలగన్నాడు?

ఈ హిట్లరైట్ జనరల్ స్పైడెల్‌ను గురించి భారతీయులలో అనేకులు బహుశా వినివుండకపోవచ్చు. ఐరోపావారు, ముఖ్యంగా ఫ్రెంచి వారికి ఆయన్ను గురించి బాగా తెలుసును. 1946 లో ఆయన ఉత్తరువుల వల్లనే అనేకానేకంగా ఫ్రెంచి దేశభక్తులు హింస పెట్టబడి కాల్చివేయబడ్డారు. గ్రామాలకు గ్రామాలే, పట్టణాలకు పట్టణాలే విధ్వంసం గావించబడ్డాయి. ఆ సేనాని, ఎన్నోసార్లు ఆత్మవిద్రోహం చేసుకొన్న మహాపరాధి. లార్డ్ రసెల్, సుప్రసిద్ధ బ్రిటిష్ శాస్త్రజ్ఞులు, ఇటీవల స్పైడెల్ దుష్కృత్యాలను బహిర్గతం చేసే సాధికార పత్రాలను ప్రకటన చేశారు. బహిరంగంగా వేలాది ప్రజలు ఉరితీయబడడానికి, అనేకానేకంగా అమాయకులు హత్య చేయబడడానికి స్పైడెలే ప్రధాన కారకుడని ఇవి విస్పష్టం చేస్తాయి.

ఉత్తరాఫ్రికాలో స్పైడెల్, తమ ప్రధాన సైనికాధికారి జనరల్ రోమెల్‌తో కలసి, ఈజిప్టునూ, మధ్యప్రాచ్యాన్నీ కైవశం చేసుకోవడానికి ఎత్తు వేశాడు.

యుద్ధానంతరం స్పైడెల్‌కు 20 సంవత్సరాలపాటు కఠిన శిక్ష విధించబడింది.

అపఖ్యాతిపాలైన ఈ హిట్లరైట్ సేనాని జీవితం ఇంతటితో ముగిసిందని మీరనుకుంటున్నారా? అయితే పొరపడుతున్నారు. పశ్చిమ జర్మనీలోని అమెరికన్ సైనికాధికారులు యుద్ధవిరమణానంతరం హిట్లరైట్ సేనాకులను అనేకులను విడుదల చేసి పునరుద్ధరించబడిన వార్మేష్ (జర్మన్ సేనలో) లో వారికి పదవులిచ్చారు. ఈ విధంగా పునర్నియుక్తులైన వారిలో ఒకడైన స్పైడెల్ పైమెట్టుకెక్కాడు.

ఇటీవల ఐరోపా ప్రజలు, నాటో పదాతి సేనలకు స్పైడెల్ సేనాధిపతిగా నియుక్తుడైనట్టు విని కోపోద్రిక్తులైనారు.

ఈ హిట్లరైట్ సేనాని, అనేక మంది ఐరోపావారిని బలిగొన్న ఈ హంతకుడు, 17 సంవత్సరాల క్రితం ఎవరి ఉత్తరువులచేతనైతే అనేక మంది ఫ్రెంచి దేశభక్తులు, హింసించి చంపబడ్డారో ఆయన, పంకిలమైన రక్తసిక్త హస్తాలతో ఈనాడు—ప్యారిస్‌లో (నాటో ప్రధాన కార్యాలయ స్థావరం) సుస్థిరంగా వుంటున్నాడు.

